ప్రచురణము ౫

# మానవుల హక్కులు

లేక

# ప్రాథమిక స్వత్వ సిద్ధాంతము.

*

ఆచార్య శ్రీ మామిడిపూడి వెంకట రంగయ్య M. A.

# మనవి



సుప్రసిద్ధ రాజనైతిక శాస్త్రవేత్తలు ఆచార్య శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్యగారి (The Fundamental Rights of Man in Theory and Practice) అను ఆంగ్ల గ్రంథమునకు ఇది అనువాదము

ఇట్టి ప్రధాన విషయమును గురించిన గ్రంథములు ఆంగ్లభాషలోనే చాల కొద్దిగనున్నవి. ఇక తెలుగులో అసలే లేవు. భారతస్వాతంత్ర్య సమరము విజయవంతముగ ముగిసి భారతీయులు స్వేచ్ఛగ స్వతంత్ర భారతరాజ్యాంగ విధానమును తయారు చేసుకొనబోవు సందర్భమున భారతీయు లెల్లమానవు లకు స్వతస్సిద్ధములైన ప్రాథమికస్వత్వములను గురించిన సంపూర్ణజ్ఞానమును కలిగియుండుట అత్యవసరము

ఇందులకు ఉపయోగపడు ఈ ఉత్తమ గ్రంథమునకు ఆంధ్రానువాదమును ప్రచురించుటకు మాకు అవకాశ మొసగిన ఆచార్య శ్రీ వెంకటరంగయ్యగారికీ, హింద్ కితాబ్సు వారికీ మా కృతజ్ఞతలు.

మా. భూపతిసీడు,

ప్రధానసంపాదకుడు.

# మానవుల హక్కులు

— లేక —

# ప్రాథమిక స్వత్వములు

## ప్రథమాధ్యాయము

## ప్రవేశిక

మొదట వివిధ కాంగ్రెసు సభలు సమావేశాలలోనూ, తరువాత క్రమంగా బ్రిటిషు పార్లమెంటులోనూ, సంయుక్త పార్లమెంటరీ ఉపసంఘములోనూ భారత రాజ్యాంగ సంస్కరణలకై జరిగిన చర్చలలో, "మానవ ప్రాథమిక స్వాతంత్ర్యాలు" అను శీర్షిక ప్రాముఖ్యమును వహించింది. నూతన రాజ్యాంగ ప్రణాళికలో ప్రాథమిక స్వాత్వాలనుగూడా ప్రవచింపవలెనని పలుచోట్లనుంచి పలు విజ్ఞప్తులూ, సూచనలూ వచ్చాయి. ఈ సూచనలు జాతీయ కార్మిక సమ్మేళనమువంటి తీవ్రవాద సంఘాలనుంచీ, పూర్వాచారపరాయణులు, సంస్కరణ విముఖులూ నైన భూస్వాముల సంఘాలనుండీ కూడా వచ్చినై. ముస్లింలీగూ, హిందూమహాసభా మొదలగు మతసంస్థలు కూడా జాతీయ సంస్థల ప్రతినిధులతో సమానంగా, ఇంకా తీవ్రంగానూ ఈ అభిప్రాయాన్ని బలపరిచాయి, పార్లమెంటూ

సంయుక్త పార్లమెంటరీ ఉపసంఘమూ ఈసూచననుగురించి మొదట కొంత ఆలోచించాయిగాని, చివరకు త్రోసివేశాయి. అయినా, ఈసూచనను, వారు ఆమోదించే ఉండవలసింది అనీ, భావిభారతరాజ్యాంగప్రణాళికలో తప్పకుండా మానవుని ప్రాథమిక స్వత్వముల నిర్వచనమునుకూడా చేర్చడం అవసర మనీ భావించేవారు ఈదేశంలో చాలామంది ఉన్నారు వారి అభిప్రాయానుసారం ఇది దరహాంమీాద ప్రయోజనకారి కావడమే కాక, అన్ని పక్షాలకూ అంగీకారయోగ్యమైన పరిష్కారం ఏదీ లభించక బాధపెడుతూ ఉన్న ప్రత్యేక సమస్య అయిన సాంఘికసమస్యకు కొంతవరకైనా పరిష్కారమార్గంగా కూడా ఉపయోగపడగలదు. అందువలన ఈప్రాథమిక హక్కులను గురించిన విషయమంతటినీ సంపూర్ణంగా పరిశీలించి తత్వదృష్టితోడనే గాక ఆచరణవిధానానుకూల్యమునుబట్టి కూడా దానివిలువను నిర్ణయింప ప్రయత్నంచేయడం అవసరం.

ఇతర రాజకీయసిద్ధాంతాలకు చాలావాటికి ఉన్నట్లే ఈ ప్రజాస్వత్వసిద్ధాంతానికికూడా కేవల శాస్త్రీయ దృక్పథమూ, ఆచరణ యోగ్యత అనే రెండువిభాగాలూ ఉన్నాయి. కేవల సిద్ధాంతముగా ఉన్నప్పుడు అది ఉత్తమమైన న్యాయబద్ధమైన ప్రభుత్వానికి ఉండవలసిన లక్షణాలకు సూత్రీకరణగా ఉంటుంది. అంతేకాదు. ఈ సిద్ధాంతానికి లక్ష్యమైన 'ఉత్తమ ప్రభుత్వ' మనే ఆదర్శం సఫలంకావడానికి జరుగవలసిన రాజకీయపు ఏర్పాటులయొక్క స్వభావమునూ పద్ధతినీకూడా అది సూచిస్తుంది "పరిపాలకుల అంగీకార అనంగీకారములపైఆధారపడని సంతస్సిద్ధమైన హక్కులు కొన్ని మానవులకు కలవు.

ఆ హక్కులకు ప్రతిబంధకంగా పరిపాలకు లెట్టిచర్య తీసుకొన రాదు" అనే సూత్రముపైన ఆధారపడిఉన్న ప్రభుత్వమే ఉత్తమ ప్రభుత్వం అని ఈ సిద్ధాంతముయొక్క భావం ఆ హక్కులను విశదంగా నిర్వచించ వచ్చును అనికూడా ఈ సిద్ధాంతం చెపుతూంది. రాజ్యాంగ శాసనమును వ్రాసేటప్పుడు ఈ హక్కులనుకూడా దానిలో స్పష్టంగా నిర్వచించడమూ, వాటిని మార్చడానికి గాని, సవరించడానికిగాని ప్రభుత్వ నిర్వాహకులకు అధికారం లేకుండా చేయడమూ, శాసన సభలూ ఇతర ఉద్యోగి వర్గమూ-ఎవరూ ఎప్పుడూ ఈహక్కులకు భంగకరంగా ప్రవర్తించకుండా ఉండేటట్లు చూడటానికి ఉన్నతన్యాయస్థానాల లాంటి ప్రత్యేక సాధనాలను ఏర్పరచ డమూ, ఈ సిద్ధాంతం తలపెట్టిన రాజ్యాంగ పద్ధతిలో అంత ర్భాగాలు.

యూరపు, ఉత్తర అమెరికాఖండాల చరిత్రలో ఆంగ్ల అమెరికను, ఫ్రెంచి విప్లవాలు జరిగిన కాలంలో ఆ విప్లవ యుగ ఫలితంగానే అసలు ఈ సిద్ధాంతం ఉద్భవించింది. ఈ విప్లవాలన్నింటికీ ఒక సామాన్యలక్షణం ఉంది. అవి అన్నీ ఏతత్ కాలాలలోని ఆయా ప్రభుత్వాలను ధిక్కరించి ఎదిరించిన తిరుగుబాటులే. వారు నాటి ప్రభుత్వాలు బాగుగా లేవని భావించారు. వాటికి బదులుగా ఆ విప్లవకారులు తాము మంచివి అనుకొన్న ప్రభుత్వాలను ఏర్పరచుకొన్నారు. ఈ విధంగా 'అప్పుడు కూలద్రోయబడిన ప్రభుత్వపద్ధతుల' ", వాటి స్థానాల్లో నెలకొల్పబడిన ప్రభుత్వరాజ్యాంగవిధానాలకు గల ప్రధానమైన వ్యత్యాసం:—ప్రాతవాటిలో ఈ ప్రాథమికస్వత్వ

సిద్ధాంతానికి స్థానం లేకపోయింది క్రొత్తవాటికి ఈ సిద్ధాంతమే ప్రధాన కీలకమూ, మూలకందమూ అయినది.

ఈ విప్లవాలచే కూలద్రోయబడిన ప్రభుత్వాల రోజులలో హక్కులూ అధికారాలూ పాలకులకు మాత్రమే ఉండతగినవి అనీ, వారిచే పాలితప్రజలకు వారు నిర్వహింపవలసిన కొన్ని ధర్మాలూ విధులూ మాత్రమే ఉన్నాయి అనీ భావించేవారు. పౌరులకు కొన్ని హక్కులు ఉన్నాయని అంగీకరించిన చోట్లకూడా ఆ హక్కులను అనుభవించే అవకాశం ఎవరో గొప్పవారైన కొందరుఉన్నతవంశీయులకూ మతాచార్యులకూ తప్ప ప్రజలందరికీ అవి లభించలేదు. కొందరు ఉన్నతవర్గముల వారు మాత్రమే అనుభవించే ఈ హక్కులు - మానవులు కేవలం మానవమాత్రులైనందు కే అనుభవించే హక్కులుగా కాక కొన్ని విలక్షణసంస్థలయొక్క, సంఘములయొక్క ప్రత్యేకస్వత్వములుగా ఉండేవి. అసలు స్వభావతః అవి ప్రత్యేక స్వత్వములుగానే ఉండేవి. ప్రతిదేశంలోనూ ప్రజాబాహుళ్యంలో బహుసంఖ్యాకులు అనగా వర్తకులూ, సామాన్య ప్రజలూ, స్త్రీలూ, పురుషులూ అందరూ ప్రభువులయొక్క, ఉన్నతవర్గముల వారియొక్క క్షేమము కొరకు కొన్ని సేవాధర్మాలనూ కర్తవ్యాలనూ నిర్వహించాలి అనే కట్టడి ఉండేది. ఇలాంటి వాతావరణంలో ఈ మానవస్వత్వసిద్ధాంతం ఉద్భవించి వర్ధిల్లింది. ప్రజలుకూడా కొన్ని హక్కులను కలిగి ఉన్నారు అనీ వారు ఆ యా తరగతులవారు అయినందువలన కాక కేవలం తమలో మానవత్వమును కలిగి ఉన్నందు కే అవి వారికి సహజంగా సంక్రమించాలి అనీ ఈ సిద్ధాంతం ప్రకటిం

చింది. ఈ సిద్ధాంతానుకూలురలో కొందరు తీవ్రవాదులు ప్రభుత్వానికి, అనగా ప్రభుత్వాన్నినడిపే ప్రభుత్వోద్యోగులకు ప్రత్యేకపు హక్కులేవీ ఉండకూడదనీ, ప్రజలకొరకు వారు నిర్వహించవలసిన కొన్ని విధులూ, కర్తవ్యాలూ మాత్రమే వారికి ఉండాలనీకూడా అన్నారు ఈ విధంగా ప్రభువులకే సర్వఅధికారాలూ, హక్కులూ ఉండాలనే సిద్ధాంతానికి ప్రతిగా ఈ మానవస్వత్వ సిద్ధాంతం తయారయింది

---

# ద్వితీయాధ్యయము

## సిద్ధాంతావతారిక

"మానవ ప్రాధమికస్వత్వాలు" ఒక సిద్ధాంతరూపం ఎలా తాల్చినదీ తెలుసుకొనడానికి పదహారు, పదిహేడు, పద్దెనిమిది శతాబ్దాల యూరపుఖండ చరిత్ర మనకు ఆధారం. 16 వ శతాబ్దారంభంలో యూరపుఖండంలో కొంచెం ఇంచుమించు ప్రతిదేశాన్నీ ఒక నిరంకుశుడగు రాజు పాలిస్తూ ఉండేవాడు. మధ్యయుగంలో పూర్తిగా భూస్వాముల చేతులలోనూ పుర పాలక సంఘాలలోనూ, పంచాయితీలలోనూ, మతసంస్థల (చర్చిల) లోనూ విభక్తమై ఉంటూవచ్చిన రాజకీయాధికారం మళ్ళీ అప్పుడు రాజుల చేతులలో కేంద్రీకృతం అయింది. చాలాదేశాల్లో భూస్వాములూ, మతాధిపతులూ, నగర వాసులూ సాంప్రదాయ సిద్ధంగా అనుభవిస్తూ ఉండిన

కొన్ని హక్కులు మాయమైపోయాయి మెల్లిగా తలెత్తి క్రమంగా విప్లవయుగంలో నిరంకుశరాజరికానికి ప్రబలతమ, బలవత్తమ శత్రువైన మధ్యతరగతి, ఆరోజులలో అచంచల స్వామిభక్తితో రాజులను సేవిస్తూ ఉండేది వ్యాపారస్తులకూ, పెట్టుబడిదారులకూ పూర్వంకంటే ఎక్కువ విస్తారంగా ధనార్జనచేయడానికి నూతనమార్గాలు లభిస్తున్నాయి. ప్రజలందరూ క్షేమకరమైన, శాంతియుతమైన జీవితమును గడుపుతూ ఉండటము, వారికి ఇతరవిషయాలన్నింటికంటె ఎక్కువ ముఖ్యమూ అవసరమూ, లాభకరమూ అందువలన తమ వినోదార్థం ఎల్లప్పుడూ చిల్లర కలతలను రెచ్చగొడుతూ శాంతిని భగ్నంచేసే మోతుబరి భూస్వాముల బారినుండి రక్షణకోసం ఆవర్తక వర్గం నిరంకుశచక్రవర్తుల నాశ్రయించడమే తనకు ఏకైక శరణ్యం అని భావించింది. అందుచేత వారు తమ వర్తకముపైన అధికారం చలాయించే హక్కు అదివరకులాగ స్థానిక పట్టణ పాలకసంఘాల చేతులలో ఉండడానికంటె నిరంకుశ చక్రవర్తుల చేతులలోనికి మార్చడమే మంచిది అని ఈ మార్పును సమర్థించారు. దీనివలన దేశంలో వర్తకం, వ్యాపారం బాగా అభివృద్ధి పొందడానికి మంచి అవకాశం లభించింది. రాజులు, చర్చి (మతసంస్థ) ల యొక్క అధికారాలను నాశనంచేసి అనేకచోట్ల వాటికి సంబంధించిన ఆస్తిపాస్తులను కూడా అపహరించి అదివరకు వ్యాపారస్తులను బాధిస్తూఉండిన మతసంబంధములైన నిర్బంధములను తొలగించి వ్యాపారాభివృద్ధికి బాగా దోహదంచేశారు. ఇందువలన ఇదివరకు ముడుపుల్లో నిరుపయోగంగా పడిఉన్న డబ్బు చాలా

భాగం మళ్లీనాడుకలోకివచ్చింది. విదేశవర్తకులకు ఓడదొంగల భీతి లేకుండా రక్షణయిచ్చి, విదేశప్రభువులతో సంప్రదించి ఉభయతారకమువైన వర్తకపు టొడంబడికలు చేసుకొని, రాజులు విదేశవాణిజ్యాన్ని కూడా విశేషంగా ప్రోత్సహించారు ఇలా అనేక విధాలుగా వృద్ధిపొందుతూన్న మధ్యతరగతివారు పుష్కలంగా ధనం సంపాదించుకొని వృద్ధిలోనికి రావటానికి రాజులు విశేషంగా సహాయపడ్డారు ఇదే 16 వ శతాబ్దంలో ఈ నూతన మధ్యతరగతివారికీ, నవీన నిరంకుశప్రభువులకూ గల స్నేహబంధానికి కారణం అయింది

కాని కొంతకాలానికి ఈ మధ్యతరగతులవారు ఇల్లా తమకు శాంతిభద్రతలను కలిగించినందులకుగాను రాజులు తమవద్దనుంచి కోరుతూఉన్న ప్రతిఫలం తమకు మరీ భారవహంగా తయారైనట్టు భావించారు. సర్వాధికారులైన రాజులు వారికి మోతుబరులయొక్కా, మతాధిపతులయొక్కా పీడ నమునుండి నిరంకుశత్వమునుండి విమోచనం కలిగించిన మాట వాస్తవం కాని తప్పుడు జరిగినదల్లా వెనుకటి పీడనకూ నిరంకుశత్వానికీ బదులుగా మరో నూతనపీడనకూ నిరంకుశత్వానికీ వారు గురికావలసి వచ్చింది. నిజానికి వారు పీడింపబడటమనేది ఎలాగూ తప్పనప్పుడు పీడించేవారు మోతుబరి భూస్వాములూ మతాధిపతులూ అయినా లేక రాజులయినా – వారికి రెండూ ఒకటే. ఈ రాజులు తమకుగల శక్తినీ, అధికారాన్నీ, ముఖ్యంగా తమబలాన్నీ అభివృద్ధిచేసుకొనడానికీ తమయొక్కా తమ వంశాలయొక్కా ప్రయోజనాలను సాధించుకొనడానికీ ఉపయోగించుకొనడం ఆరంభించారు మధ్యతరగతి వారి

రయొక్కగాని తమ ఇతర ప్రజలయొక్కగాని క్షేమ లాభ అభ్యు దయాలు - వారి దృష్టిలో అంత ప్రధానమైనవి కాక పోయి నాయి. దీనితో అధికారసంపాదనమే పరమార్థమను రాజ కీయ తత్వమునకునూ, ప్రజాక్షేమమే పరమార్ధమను రాజకీయ తత్వమునకూ తీవ్రమైన సంఘర్షణ బయలుదేరింది. మొదటి దానికి చక్రవర్తుల ప్రాథమికస్వత్వసిద్ధాంతమూ, రెండవదానికి మానవప్రాథమిక స్వత్వసిద్ధాంతమూ పట్టుకొమ్మ లయినాయి.

మతసమస్య ఈ క్లిష్టపరిస్థితిని ఇంకా విషమింపజేసింది. 16 వ శతాబ్దంలో వచ్చిన మత సంస్కరణోద్యమం యూరపు ఖండవాసులలో మతవిషయికములైన భిన్నత్వములను సృష్టిం చింది దీనివలన మతవిషయికమైన అభిప్రాయభేదం వచ్చి నప్పుడు రాజునకూ ప్రజలకూ మధ్యగల పరస్పర సంబంధా లెలా ఉండాలి అనే సమస్య ప్రాముఖ్యంలోకి వచ్చింది ఇలాంటి పరిస్థితి వచ్చినప్పుడు ప్రజలు తమ రాజునూ, రాజు అట్టి ప్రజలనూ నాస్తికులనీ, పాపులు అనీ నిందించుకొనేవారు. ఆరోజులలో నాస్తికతను మహాపాపంగా భావించేవారు పైగా ఆ యా దేశాల ధర్మశాస్త్రానుసారం నాస్తికత్వం దండనార్హ మైన నేరం. భావాలలోగాని, ఆచరణలోగాని ఎవరికీ ఏమా త్రమూ సహనభావం లేకపోవడం ఆ యుగలక్షణం. ప్రతి రాజూ తనప్రజలలో నిజమైన మతధర్మాన్ని వ్యాపింపచేయడం తన ధర్మంగా భావించేవాడు, నిజమైన మతం అంటే తనకు ఇష్టమైనదే అని అతనిభావం. సంపూర్ణమైన నిరంకుశమైన అధికారం తన జన్మహక్కు అని భావిస్తూన్న రాజు, తనప్రజల లోనే - తన అధికారాన్నిగాని, తన మతసంస్థయొక్క అధికా

రాన్నిగాని, ధిక్కరించేవారు ఉండటం వన ప్రతిష్ఠకు భంగ
కరమని నిర్ణయించుకొన్నారు. మతముపేరిట యథేచ్ఛగా
దండించడం సర్వసాధారణ మైపోయింది. రాజాధికారముద్ర
పడిన మతసిద్ధాంతాలను ఉల్లంఘించి అన్యమతాలను అవలం
బించినవారందరికి బహిరంగంగా ప్రార్థనచేసుకొనే హక్కు లేదని
శాసించారు వారికి పౌరస్వత్వము లే లేకుండాచేశారు. క్రూర
మైన కారాగారవాసశిక్షా, దేశంలోనుంచి బహిష్కరించి
దూరదేశాలకు పంపడమూ, ఆస్తిపాస్తులను ప్రభుత్వాధీనము
చేసుకొనడమూ, దారుణంగా హింసించడమూ, చంపడమూ—
ఇవీ వారికి విధింపబడేశిక్షలు. స్పెయినుదేశపు రాజు అయిన
రెండవ ఫిలిప్పుచేతుల్లో హాలెండు దేశసులు అనుభవించిన
బాధలూ, ఇంగ్లీషువారివలన ఐర్లండు దేశీయు లనుభవించిన
కష్టాలూ, ఫ్రెంచిరాజు 14 వ లూయీ చేతుల్లో హ్యూజి
నాట్లు అనుభవించిన యాతనలూ—విపరీతంగా సాగిన ఈ మత
విషయక దారుణ కృత్యాలకు కొన్ని ఉదాహరణలు— చాలా
దేశాలలో మతవిషయకములైన యుద్ధాలు చెలరేగి అనేక
పట్టణాలూ, పల్లెలూ సర్వనాశనం చేయబడ్డాయి. క్రైస్తవ
మతం అనేకశాఖలుగా చీలిపోక తప్పదు అనీ, వాటిలో
ఏశాఖా తక్కిన శాఖలను బలవంతంగా గాని సామమార్గాన
గాని సమాధానపరచ లేదనీ ఈ నిర్బంధవిధానం వలన ఆస్తి
పాస్తులు నాశనం అనడమూ ప్రశాంతమైన ఫలవంతమైన
వ్యాపారాభివృద్ధి సన్నగిలడమూ జరుగుతూంది అనీ, మతవిష
యకములైన అభిప్రాయభేదాలు వచ్చినప్పుడు సహనంతో
ప్రవర్తించడం సర్వథా శ్రేయస్కరమనీ, రాజకీయాలు మత

విషయికములైన వ్యవహారాలలో జోక్యం కలిగించుకోకూడ దనీ – ప్రజలూ పాలకులూ కూడా చాలా కాలానికి గాని గ్రహించలేకపోయారు.

నిరంకుశప్రభువులు తమ ప్రజల మతాభిప్రాయాలనూ, కర్మలనూ తమ అదుపులో ఉంచుకొనడానికీ, ఇంకా అనేక విధాల వారిని అణచడానికీ కూడా తమ అధికారశక్తిని పూర్తిగా ఉపయోగించారు. పన్నులను అంతకంతకు పెంచి భరింపరానివిగా చేశారు. బలవంతపు ఋణాలను వసూలు చేశారు. ప్రత్యేక గుత్త వ్యాపారపు హక్కులను తమ తాబే దార్లకు అమ్ముకొన్నారు ఇలా, ఇన్నివిధాలుగా వసూలుచేసిన ధన మంతటినీ వారు తమ వ్యర్థరాజభోగాలకోసమూ, విలా సాలకోసమూ, తమ ఆస్థానాలనూ, ఆశ్రితులనూ, అమిత భాగ్యభోగ్యాలతో నింపడముకోసమూ, తమ కుటుంబముల ప్రతిష్ఠను వృద్ధిపొందించు యుద్ధాలకోసమూ విచ్చలవిడిగా వెచ్చించేవారు ఈ ఆర్థికవిధానమువలన అన్ని తరగతుల ప్రజలూ, ముఖ్యంగా ఆస్తే తమ సర్వస్వమూ అయిన మధ్య తరగతివారూ ఎక్కువగా నష్టపడ్డారు పన్ను చెల్లించడమంటే ఒకమానవుని ఆస్తిలో కొంతభాగాన్ని ప్రభుత్వాజ్ఞానుసారం బలవంతముగా లాగుకొనడముగా ఉండేది. ఇలాంటి పరిస్థితుల లోనే వారి ఆస్తిహక్కుల రక్షణకొరకు మానవ ప్రాథమికస్వత్వ సిద్ధాంతం మొట్టమొదట అంకురించింది. మానవుని ఆస్తిని అతని అంగీకారం లేకుండా ఏ ఇతరమానవుడూ గాని లేక ప్రభుత్వముగాని అపహరించకూడదు–అనేది దీనిలో ఒకసూత్రం. లోకేగారు వ్రాసినట్లు ఒకని పొలమునకూ తోడివాని పొలము

నకూ మధ్య న్యాయశాస్త్ర రక్షితములైన కాడిగట్లు మొదలై నవి స్వక్రమంగానే ఏర్పాటుచేయబడినా, ప్రజాపాలనము చేసే ప్రభుత్వానికి ఏ మానవునియొక్క ఆస్తిలోనైనా తనకు తోచి నంత భాగాన్ని తన యిష్టంవచ్చినప్పుడల్లా తీసుకొంటూ ఉండ టానికి హక్కు, అలా తీసుకొని తన యిష్టానుసారం ఉపయో గించుకొనే హక్కు ఉన్నట్లయితే, ఎవరైనా తమ యిష్టాను సారం, ప్రజలను సంప్రదించకుండా వారిమీాద పన్ను వేసే అధికారం తమకు ఉన్నదని అనేటట్లయితే (ఆరోజులలో సర్వా ధికారులైన రాజులందరూ తమకు ఈ అధికారం ఉన్నదనే వారు)-వారు మానవునిఆస్తికి సంబంధించిన న్యాయసూత్రాన్ని భగ్నంచేసి, ప్రభుత్వ లక్ష్యాన్నే కూలదోస్తున్నారన్నమాట. లేకపోతే మరొకనికి నా ఆస్తిని ఎప్పుడు తలుచుకొంటే అప్పుడు లాగుకొనే అవకాశంఉంటే ఇంక ఆ ఆస్తి నాది అనడ మెందుకు?

నిరంకుశయుగంలో న్యాయశాస్త్రం అంటే చక్రవర్తి యొక్క వ్యక్తిగతమైన అభీష్టమే. అతని ఆ ఇష్టము ఎంత నిరం కుశంగానూ, అనాలోచితమైనదిగానూ, అసంబద్ధంగానూ ఉన్నాసరే. 'నేను దానిని కోరుతున్నాను కనుక అది న్యాయ బద్ధమైనదే' అన్నాడు ఫ్రెంచిరాజు 14 వ లూయీ ఈ పద్ధతి లోనే కొంచెం ఇంచుమించు యూరపులోని ప్రభుత్వాలన్నీ సాగుతూ ఉండేవి. విజ్ఞానవంతులైన రాజులు బహుకొద్దిమంది. ఎక్కువమంది తాము అమలు జరిపిన తెలివితక్కువ న్యాయ సూత్రాలతోనూ, వాటిని ధిక్కరించిన వారికి విధించిన క్రూర మైన అమానుషమైన శిక్షలతోనూ ప్రజలను చెప్పరాని

ఇక్కట్లపాలుచేశారు. ఈ న్యాయశాస్త్ర సిద్ధాంతం ఇంకా కొన్ని దారుణములైన ఫలితాలనుకూడా కలిగించింది దీని వలన రాజులకు కొన్ని ప్రత్యేకపు నేరాలకు న్యాయశాస్త్రాన్ని అన్వయింపజేయడానికిగాని, అతిక్రమించడానికిగాని, పూర్తిగా త్రోసిరాజనడానికి గాని అధికారం కలిగింది. నిజానికి దీని అర్థం—న్యాయశాస్త్రానికి కట్టుబడి ఉండగోరేవారికీ దాన్ని ఉల్లంఘించి భగ్నంచేయదలచుకొన్న వారికీ గల భేదాన్ని తుడిచివేయడమే అయింది. ఈ సిద్ధాంత ఫలితంగా ఏర్పడిన మరొక పరిస్థితి ఏమిటంటే-అనుపూర్విగా వస్తూవున్న న్యాయస్థాన విచారణపద్ధతులను అనుసరించి కాక తమ ఇష్టానిష్టాలననుసరించి ఒక ప్రత్యేక సందర్భంలోగాని, ఒకమనిషి లేక కొందరు మనుష్యులయొక్క విషయాల్లోగాని రాజులు యథేచ్ఛగా బలవంతంగా న్యాయశాస్త్రాన్ని ఉపయోగించడానికి వీలు కలిగింది. కొన్ని సందర్భాలలో ప్రత్యేకంగా కోర్టులను నెలకొల్పి ప్రత్యేక విధానాన్ని అవలంబించారు. న్యాయాధిపతులను నియమించడానికీ బర్తరఫు చేయడానికీ తమకుగల అధికారాన్ని పురస్కరించుకొని రాజులు న్యాయస్థానాల తీర్పులలోకూడా జోక్యం కలిగించుకొనేవారు. నిరంకుశంగా కొందరిని ఖైదులలో నిర్బంధించి విచారణలేకుండా ఎంతకాలమైనా అలాగే ఉంచేవారు. ఈ విధంగా న్యాయశాస్త్రబద్ధమైన పరిపాలనగాని వ్యక్తిస్వాతంత్ర్యానికి రక్షణగాని లేకుండాపోయింది.

ప్రజల ప్రాథమిక హక్కులకోసం పోరాడేవారు సరిగా దీనికి వ్యతిరేకమైన న్యాయశాస్త్రసిద్ధాంతాన్నీ, విధానాన్నీ సూచించారు. 'ప్రజాభీష్టముల ప్రకటనే న్యాయశాస్త్రం.

దానిని తయారుచేసేటప్పుడు ప్రత్యక్షంగా గాని, లేక తాను ఎన్నుకొన్న ప్రతినిధి ద్వారాగాని తన అభిప్రాయాన్ని ప్రకటించి దాని నామోదించే అధికారం ప్రతిపౌరునికీ ఉన్నది. కష్టమో సుఖమో అది ప్రజలందరికీ సమానంగా వర్తించాలి. న్యాయశాస్త్రామోదం లేకుండా, న్యాయశాస్త్రచోదితములైన పద్ధతులలో విచారించకుండా ఎవరినీ నేరస్తులుగా భావించడం గాని (ఎరెస్టు చేయడంగాని) ఖైదులో ఉంచడంగాని చేయకూడదు పూర్తిగానూ, స్పష్టంగానూ అవసరములైన శిక్షలను మాత్రమే న్యాయశాస్త్రం విధించాలి నేరానికి పూర్వమే చేయబడిన న్యాయశాసనరీత్యానూ ఆ శాసనం సక్రమంగా వర్తింపజేయబడితేనూ తప్ప ఎవరినీ శిక్షింపరాదు అని వారు చాటారు.

ఈ సర్వాధికారులైన చక్రవర్తులు ప్రజలయొక్క అభిప్రాయాలను తమ అదుపులో ఉంచుకొనడానికి కూడా తమకు అధికారం ఉంది అనేవారు. ముద్రణాయంత్రాలపైనా, పత్రికలపైనా తీవ్రమైన నిఘా ఉండేది. దీనికి ఉదాహరణకు—ఫ్రాన్సులో (నిజానికి తక్కిన దేశాలలోనూ ఇలాగేఉండేది) 'ప్రతి పుస్తకమూ, పత్రికలలోని ప్రతివ్యాసమూ ప్రచురింపబడటానికి పూర్వమే ఈ నిఘా ఉద్యోగస్థులవద్ద దాఖలుచేయబడి వారిచేత ఆమోదింపబడాలి. వారి అనుమతిలేనిదే ఏ ముద్రాపకుడూ, దేనినీ ముద్రించకూడదు. ఈ షరతు లన్నింటినీ అనుసరించి ప్రకటించిన పుస్తకాలనుకూడా పోలీసువారు పట్టుకొని తగులబెట్టివేయవచ్చును, వీలుంటే ముద్రించిన ప్రతులన్నింటినీ నాశనంచేయువచ్చును, ప్రకటనకర్తలూ, గ్రంథ

కర్తలూ, పౌరకులూకూడా శిక్షింపబడవచ్చును. జరిమానాలు విధింపబడవచ్చును ఖైదులో పెట్టవచ్చును ఇలా ఆ చక్రవర్తులు చెలాయించే అధికారాలకు అంతులేకుండా పోయింది.

చక్రవర్తులయొక్క ఈ నిరంకుశ నియంతృత్వాన్ని ఆధ్యాత్మికంగానూ, లౌకికంగానూకూడా కొందరు సమర్థిస్తూ ఉండేవారు ఈ ఆధ్యాత్మికవాదులూ మతవిశ్వాసాలు కల ఇతరులూ తమ వాదనకు చక్రవర్తి దైవాంశసంభూతుడు అనే ప్రసిద్ధసిద్ధాంతమును ఆధారంగా చేసుకున్నారు. ఈ సిద్ధాంతం ప్రకారం రాజులందరూ దైవాంశకలవారు గనుకనే పరిపాలిస్తున్నారు. వారికి అధికారం భగవంతుని వద్దనుంచి సంక్రమించినదేగాని ఇతర మానవ మాత్రులవద్దనుంచి కాదు. వారు దేవునికి ప్రతినిధులు భూలోకంలో ఆయనకు ప్రతిబింబాలు తమ ప్రవర్తనకు వారు ఆ భగవంతునివద్దనే సంజాయిషీ చెప్పుకోవాలిగాని తమ ప్రజలకు కాదు విజయము పొందిన పార్లమెంటుచేత ఉరితీయించబడిన ప్రథమ చార్లెసు ఇలా అన్నాడు. "దేవుడు చేసేదానిని శంకించడం నాస్తికత్వం, వదరుబోతుతనం ధర్మపరులైన క్రైస్తవులు బైబిలువాక్యాలలో స్వయంవ్యక్తమయిన పరమాత్మసంకల్పముతో తృప్తిలొతారు. అలాగే ఏ పౌరుడుగాని తనరాజు చేసేపనిని చేయదగినపని అనిగాని, చేయరానిపని అనిగాని తర్కించడం, అవివేకం, అవిధేయత, ధిక్కారం. రాజశాసన రూపంలో అభివ్యక్తమైనదే భగవత్సంకల్ప మని నమ్మాలి. రాజు తన శాసనముద్వారా వెల్లడించిన అభిప్రాయాన్నే అతడు అనుసరించాలి" రాజాధికారానికి ఎదురుచెప్పినా (ఆయనను) ప్రతిఘటించినా భగ

వంతుని ఆజ్ఞను తిరస్కరించినప్పుడు మానవుడు ఆచరించవలసిన మహోత్తమ పౌరధర్మం, అధికారులయెడ అచంచలములైన వినయ విధేయతలను కలిగిఉండటమే కాని వారిని ప్రతిఘటించటం కాదు

లౌకికదృష్ట్యా ఈ సంపూర్ణాధిపత్య (నిరంకుశత్వం కూడాను,) సిద్ధాంతాన్ని సమర్థించే వారిలో ఇటలీ దేశస్థుడు మాఖియవెల్లీ, ఇంగ్లండు దేశస్థుడు "హాబ్సు" అనేవారు చాలా సమర్థులు 16_వ శతాబ్దంలో ఇటలీ చాలా చిత్రమైన పరిస్థితిలో పడింది. ఐక్యతా, సంఘీభావమూ లేక యూరపియను దేశాలన్నింటిలో కీ బలహీనమైన రాజ్యంగా తయారయింది. ఆ పరిస్థితుల్లో తనదేశంలో అశాంతికరములైన శక్తులనన్నింటినీ అణచివేసి బయటినుంచి ఆదేశంమీదికి దండెత్తజూచే విజేతలను అరికట్టగల సర్వశక్తిమంతుడైన ప్రభువు బయలుదేరడమొక్కటే తనదేశస్థులు ఆశింపదగిన దని మాఖియవెల్లీ విశ్వాసం. అందువలన అతడు సర్వాధికారసిద్ధాంతానికి దాసుడై పోయాడు. అతని అభిప్రాయంలో రాజు దృష్టిలో ఉంచుకోనవలసినది ఒకటే ఆశయం.తనఅధికారమును రక్షించుకోవడమూ, అభివృద్ధి చేసుకోవడము. ఈ ఆశయాన్ని సిద్ధింపజేసుకొనడానికి అతడు ఏవిధంగానైనా ప్రవర్తించవచ్చు. సామాన్యమానవులందరూ బద్ధులై ఉండవలసిన నీతినియమములాతనిని బంధించవు. అతడు తన ప్రజలను కొన్ని హక్కులుగల మానవులనుగా పరిగణించవలసిన పనిలేదు. కేవలం తన స్వప్రయోజనాలకొరకు ఉపయోగించుకొన దగిన ముడివస్తువులుగా భావించాలి. 'వారికి సంతృప్తి కలిగే వీలులేకపోతే

లేక పోవచ్చు కాని, నిర్బంధపరచి అయినాసరే వారిచే తన కార్యాన్ని సాధించుకోవాలి. ఇందులో ఏపద్ధతి నవలంబించినా అతని ఉద్దేశము వారి భద్రతారక్షణమాత్రం కాదు తన అధికారాన్ని కాపాడుకొనడమే. మరోవిధంగా సంక్షోభావం కలగడానికి గాని, నిలవడానికిగాని అవకాశంలేదు.

మాఖియవెల్లీ సిద్ధాంతానికి జాతీయ ఐక్యభావం మూలకందమైనట్లే హాబ్స్ రాజకీయ దృక్పథంలో జాతీయ భద్రతాసిద్ధాంతం రూపురేఖలు దిద్దింది. హాబ్స్ ఇంగ్లండు లోని అంతఃకలహాపు రోజులలోనివాడు. ఆ రోజులలో దేశం చాలా బీభత్సకరమైన స్థితిలో ఉండేది. ప్రజలు సర్వదా విపరీతంగా భయవిహ్వాలులై దినమొక యుగంగా కాలం గడుపుతూ ఉండేవారు ఈ పరిస్థితిని గ్రహించే అతడు ఇలా నిర్ణయించాడు – ప్రజలకు ముఖ్యమూ తత్క్షణావశ్యకమూ అయిన అభయరక్ష లభించి వారి కష్టాలు గట్టెక్కాలంటే నిరంకుశమూ, సర్వశక్తిమంతమూ అయిన అధికారంగల ప్రభుత్వం వెంటనే స్థాపనకావడమే ఏకైకమార్గం. ఈసర్వాధికార ప్రభుత్వం ఏకచ్ఛత్రాధిపత్యంలో అయినా కావచ్చును. లేక ఒక సంఘగతమైనదైనా కావచ్చును. అయితే ఈ రెంటిలో తొల్లింటిదే ఆయనకు ఎక్కువఇష్టం. మానవుడు తనకు శాంతి కావాలంటే బేషరతుగా ఒక ప్రభుత్వానికి లొంగి ఉండితీరాలి. తనను శాసించడానికి ఆ ప్రభుత్వానికిగల హక్కును గురించి అతడు ప్రశ్నింపరాదు. అతనిదృష్టిలో హక్కులన్నీ ప్రభుత్వానికేఉండాలి, ప్రజలకు వారు నిర్వహింపవలసిన కొన్ని ధర్మాలు మాత్రమే ఉండాలి. ప్రజలలో ఎవడైనా ప్రభుత్వాన్ని కాదని

స్వయంగా తనకు కొన్నిహక్కులు ఉన్నా యంటూ తగిప్ర లాటకు దిగితే – అతడు శాంతిసౌఖ్యాలను నాశనంచేసే అరాజకత్వమూ, అరక్షితస్థితీ ఏర్పడటానికి దారితీస్తున్నాడన్నమాట. రాజకీయైక్యతా, భద్రతా మానవునికి అమూల్యములైన అవసర వస్తువులు వీటితో పోల్చిచూచినప్పుడు స్వేచ్ఛా, ఆస్తి పాస్తులుకూడా ఏమీ పరిగణింపదగినవి కావు. ప్రభుత్వం అపారమైన సంపూర్ణాధికారం కలది అయినప్పుడే ఈ రాజకీయ ఐక్యతా, భద్రతా లభిస్తాయి. నిరంకుశత్వమును సమర్థిస్తూ మాఖియవెల్లి, హాబిసూ చేసేవాదన ఇది. ఆ రోజుల్లో ప్రజలు స్వాతంత్ర్యానికంటె ఐక్యత, భద్రత ఎక్కువవి అనుకొనే ఆ దేశాలలో వారి వాదాలకు కొంతమంది అనుయాయులు ఉండటం సహజం.

ఆ నిరంకుశయుగానికి మరొక విలక్షణమైన లక్షణం– సోపానపరంపర వంటి సంఘనిర్మాణం పైవారికీ, క్రిందవారికీ భేదం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. భూస్వాములూ, మతాధికారులూ పైమెట్టులకు చెందినవారు. ఈ అసమానత్వమే సర్వత్రా ప్రబలమై ఉండేది. భూస్వాములవర్గమూ, మతాధిపతివర్గమూ సంఘానికి ఏవిధమైన సేవా చేయకుండానే బహువిధ ప్రత్యేకసౌకర్యాల ననుభవిస్తూ ఉండేవి. వారు సంఘమంతటిలోకి ధనవంతులై ఉంటికూడా ప్రభుత్వం విధించే పన్నులను కొందరు పూర్తిగా అన్నింటినీ, కొందరు కొన్నింటినీ కట్టవలసిన అవసరంలేదు. ఈ మినహాయింపువలన పరిశ్రమలనూ, వ్యాపారమునూ నడుపుతూఉన్న మధ్యతరగతి వారూ, రైతులూ, కళాకారులూ, శ్రామికులూ మొదలైన

ప్రజాసామాన్యం విపరీతమైన పన్నులభారంతో క్రుంగిపోతూ ఉండేది. సంఖ్యలో చాలా తక్కువమందే అయిన భాగ్యవంతులే భూమిలో చాలాభాగానికి యజమానులు. వ్యవసాయంచేసే పేదరైతుల దగ్గరనుంచి అనేకవిధాలుగా ధనాన్ని గుంజుతూ ఉండేవారు. చాలా బాధాకరములైన వెట్టిచాకిరీలు చేయించుకొనేవారు. మతాధిపతులు వారిదగ్గరనుంచి 'టైత్' లనే (పంటలో పదవ వంతు) పన్నులను వసూలుచేసేవారు. ప్రజాసామాన్యం కష్టపడి పనిచేయక తప్పదు, కాని తత్ఫలితంగా తయారయిన భోగ్యవస్తువులన్నింటినీ పైతరగతులవారే అనుభవించేవారు. దీనికితోడు మతసంస్థల్లో ఉన్నతపదవులనూ నావిక, సైనిక, రాజకీయోద్యోగాలనూ అన్నింటినీ ఆ పై తరగతులవారి అబ్బాయిలకే ముడుపుగట్టి ఉంచేవారు. చక్రవర్తి ధనాగారంలోంచి భూస్వాములకూ, మతాధిపతులకూ అనేకవిధాలయిన పెన్షనులూ, బహుమతులూ ప్రవాహాలుగా వచ్చిపడుతూ ఉండేవి ఈ అసమత్వస్థితికి ఎక్కువగా విచారపడినవాళ్ళు మధ్యతరగతిలోని ధనికవర్గమూ, పెట్టుబడిదార్లూ, పారిశ్రామికులూ, న్యాయవాదులూ, వైద్యులూ, ఉపాధ్యాయులూ, విద్వాంసులూను. వ్యాపారంచేసి ఎక్కువగాగడించిన భాగ్యవంతులూ, ప్రతిభావంతులూ, శక్తివంతులూ అయినవారిలో చాలామందికి సాంఘికంగా తమకు తక్కువ తనము నాపాదించి పరిపాలకవర్గంలో తమకు ప్రవేశంలేకుండాచేసిన ఆ విధానమంటే పూర్తిగా అసంతృప్తి కలిగింది. వారికి తమ పైతరగతులవారిమీద ద్వేషమూ, ఈర్ష్య కలిగి వారికన్న తాము నైతికంగా అధికులమనేభావం ప్రబలమైంది. సమా

శత్వమనే ప్రాథమిక స్వత్వంకోసం ఎక్కువగా ఆందోళన చేసిన వారు వీరే.

ఫ్రెంచి విప్లవప్రవక్త రూసో మతసూత్రబంధితమైన సంఘవ్యవస్థవలన మధ్యతరగతులవారికన్న ఎక్కువగా పీడింపబడుతూఉన్న సామాన్యమానవుని దృక్పథంతో ఈ సమానత్వ సూత్రాన్ని పరిశీలించాడు నైతికసత్ప్రవర్తన దాని పరిశుద్ధ స్వరూపంతో సామాన్యమానవునిలోనే వ్యక్తం అవుతుంది గనుక, ఆయన సామాన్యమానవుణ్ణే ఆదర్శజీవిగా భావించాడు. మానవజాతి అంటే ప్రజాసామాన్యమే అని ఆయన అభిప్రాయం. ఆ ప్రజాసామాన్యేతరమైనది ఏదీ పరిగణనీయం కాదు. ఏ తరగతికిచెందినవాడైనా మానవుడు మానవుడే. అందుచేత ఎక్కువ సంఖ్యాబలంగల తరగతులు ఎక్కువ గౌరవం పొందాలి.

ఒకవిధంగా అమెరికా విప్లవాన్ని అసమానత్వంమీద— ఇంగ్లండులోని ఇంగ్లీషువారు అమెరికాలోని ఇంగ్లీషువారిని పాలించడానికి తమకు ప్రత్యేకఅధికారం ఉన్నట్టు వ్యవహరించడంవలన జరిగిన తిరుగుబాటుగానే పరిగణింపవలసి ఉంటుంది. అమెరికనులకు ప్రాతినిధ్యంలేని ఇంగ్లీషు పార్లమెంటు అధినివేశదేశాలమీద పన్నులు విధించడానికీ, వారి వాణిజ్యాన్నీ, పరిశ్రమలనూ శాసించడానికీ తనకు హక్కు ఉన్నదని వాదించింది. వారు తీవ్రప్రతిఘటనకు పూనుకుంటూ ఉన్నట్లు తెలియగానే, పార్లమెంటు అంతవరకూ అధినివేశాలు అనుభవిస్తూ ఉన్న స్వపరిపాలనను రద్దుచేసింది. ఇంకా అనేక బలాత్కారపు శాసనాలను చేసింది. ఆ [illegible]ని [illegible]లను మిలి

టరీ పరిపాలనలో ఉంచి, నేరస్థులను న్యాయస్థానాలలో విచారించడం మొదలైన పౌరస్వత్వములుకూడా వారికి లేకుండా చేసింది అమెరికనులు ఈ అసమానత్వమునకు తమ తీవ్రమైన అసమ్మతిని వెల్లడించారు. అయినా ఈ వివాదకు ప్రారంభ దశలో వారు కోరినది సంపూర్ణస్వాతంత్ర్యము కాదు, ఇంగ్లీషు వారితో సమానప్రతిపత్తి మాత్రమే. చక్రవర్తి ఒక్క ఇంగ్లీషుపార్లమెంటువారి సలహాప్రకారమే కాకుండా అధినివేశ పరిషత్తు లన్నింటియొక్క సలహాలతో పరిపాలిస్తే వారు ఇంగ్లండురాజు పాలనలోనే ఉండటానికి సంసిద్ధులుగా ఉన్నారు. సమానహోదాను కలిగిఉండే హక్కు వారికి లేదని ఇంగ్లీషు వారు నిరాకరించడమే వారిని స్వాతంత్ర్యసమరోన్ముఖులను చేసింది. వారు తమ ప్రసిద్ధస్వాతంత్ర ప్రకటనపత్రంలో "ప్రపంచమందలి అన్ని రాజ్యాలతోపాటు ప్రకృతీ, పరమేశ్వరుడూ తమకు ప్రసాదించిన స్థానమునూ, సౌకర్యములనూ అనుభవించడానికి తమకు హక్కుఉన్న" దని ప్రకటించారు. అందువలన అమెరికను స్వాతంత్ర్యయుద్ధాన్నికూడా విప్లవ యుగానికి పూర్వం అన్నిదేశాల రాజ్యాంగ విధానాల్లోనూ సామాన్యలక్షణంగా ఉంటూ వచ్చిన అసమానత్వమునూ, ప్రత్యేక సౌకర్యములనూ రూపుమాపడానికిగాను జరిగిన యుద్ధంగానే పరిగణించాలి.

ఇలా రాజులకు అపరిమితమైన అధికారాన్ని సంక్రమింపజేసే, భగవద్దత్తమైనదని చెప్పబడే, హక్కును ఆధారంగా చేసికొని ఈ నిరంకుశత్వం చివరకు అన్యమత అసహనంగానూ, ప్రచండనిర్బంధవిధానంగానూ, మానవులు స్వేచ్ఛగా

ఊహించడానికీ, తమ అభిప్రాయాలను వెల్లడించడానికీ ,వారికి గల హక్కులను తొలగించడంగానూ, వ్యక్తి స్వాతంత్ర్యమును అరికట్టే చట్టవిరుద్ధమ్ములైన నిబంధనలను విధించడంగానూ, ప్రజల ఆస్తిహక్కులకు భంగకరంగా భారవహమ్ములైన అన్యాయమ్ములైన పన్నులను విధించడంగానూ పరిణమించింది. ప్రతి దేశంలోనూ బహుసంఖ్యాకు లందరిలో నిరుత్సాహమూ, దైన్యమూ, వేదనా ప్రబలమైపోయాయి. రాజులు తమ అస్త్రశస్త్రాల బలంతో సాధించిన ఐకమత్యమూ, శాంతీ వారి నిరంకుశకృత్యాలవలన కలిగిన అన్యాయాలతో పోలిచిచూచి నప్పుడు అవి ఏమంత చెప్పదగిన ప్రతిఫలాలు కావు అనవచ్చును. ఈ నిరంకుశత్వమునూ దానిని బలపరిచే లౌకిక, పారలౌకిక వాదాలనూ నిర్మూలించడంకోసం జరిగిన ప్రయత్నాలలోనే 'మానవ ప్రాథమిక స్వత్వములు' అనే సిద్ధాంతం ఉదయించింది.

---

## తృతీయాధ్యాయం

# సిద్ధాంతాంతరార్థం

ఈ సిద్ధాంతంలో ఉదహరింపబడే హక్కుల స్వభావాన్ని పరిశీలించడానికి పూర్వం, ప్రస్తుతం 'హక్కులు' అనే పదమునకు ఈ ప్రకరణంలో గల అర్థమును తెలుసుకొనడం అవసరం. ఈహక్కులు అనే పదాన్ని లౌకికదృష్ట్యా ఒక విధంగానూ, తాత్త్వికదృష్ట్యా మరోవిధంగానూ అర్థంచేసికొనవచ్చును. లౌకికదృష్ట్యా ఇవి నిరంకుశచక్రవర్తులవలన కలిగే

అన్యాయాలకు ఔషధాలవంటివి. 17, 18 శతాబ్దాల భావుకులు, నిరంకుశత్వంవలన కలిగే ప్రతి అన్యాయానికీ తగిన ఔషధాన్ని కనుగొనడం సాధ్యమే నని భావించారు. వారు కనుగొన్నా మనుకొనిన ఔషధానికి 'హక్కు'అని పేరుపెట్టారు. అందువలన ఇలా విరుగుడు కనుగొనవలసిన అన్యాయాలు ఎన్ని ఉన్నాయో, హక్కులుకూడా అన్నీ ఉన్నాయి, ఈ హక్కుల స్వభావం కూడా ఆ అన్యాయాల స్వభావముమీదనే ఆధారపడి ఉంటుంది. భారవహమ్మైన పన్నులను విధించడం ఒక అన్యాయం. మానవునికి తన ఆస్తిపైన గల ప్రాధమికస్వత్వమును గురుతించి అతని అంగీకారంలేనిదే అతని ఆ హక్కులో ఎవరూ జోక్యం కలిగించుకొనకూడదు అనే నియమాన్ని ఏర్పరచుకోవడం ఈ అన్యాయానికి విరుగుడు. అదేవిధంగా అన్యమత అపహానం అనే అన్యాయానికి విరుగుడు 'ఆరాధన విషయములో స్వేచ్ఛ' అనే ప్రాధమిక స్వత్వాన్ని అంగీకరించి ప్రభుత్వం పౌరుల ఆధ్యాత్మికజీవితాల్నికూడా శాసనబద్ధం చేయడానికి ప్రయత్నించకుండాచేయడమే. ముద్రాశాలలపైనా, పత్రికలపైనా ప్రభుత్వం చెలాయించే అధికారం వలన కలుగుతూన్న అన్యాయానికి, ప్రభుత్వం మానవునికి స్వేచ్ఛగా యోజించుకొనడానికీ, తనభావములను వెల్లడించడానికీ హక్కు ఉన్నదని అంగీకరించడమే-సహజమైన ఔషధం. ఈ హక్కులను ప్రాధమికహక్కులు అనడంలోని అర్థం. ఆ రుగ్మతలకు ఇవే తగిన ఔషధాలు అనీ, వీటికి బదులుగా ప్రయోగింపదగినది మరొకటి ఏదీలేదనీ. ఇంక ఈ హక్కులన్నిటియొక్క పని ప్రభుత్వాధికారాలకు గట్టుగానూ తద్వారా నిరంకుశత్వానికి

చెంపపెట్లుగానూ పనిచేయడమే అన్న సంగతి వేరే చెప్ప నవసరంలేదు.

అయితే ఈ ప్రణాళికలో చేర్చబడిన హక్కులలో కొన్ని సాధారణంగా బాహుళ్యంమీాద అందరికీవర్తించేవేకాని ప్రత్యేకావస్థలకు దురాయికట్లుగా పనిచేసేవి అని చెప్పడానికి వీలులేనివికూడా ఉన్నాయి వీటిని సుపరిపాలనకూ, న్యాయ సమ్మతమైన పరిపాలనకూ మూలాధారాలుగా భావించడం ఇంతకంటె మంచిది. అట్టిపరిపాలన లేనప్పుడు ఈ ప్రత్యేకపు హక్కులు, ఆ అన్యాయాలను సరిచేయడానికి అంతబాగా ఉప యోగపడక పోవచ్చును. మానవునికి తన పరిపాలకులను తాను ఎన్నుకొనేహక్కూ, వారు బాధ్యతతో ప్రవర్తించునట్లు చేసేహక్కూ దుష్పరిపాలననూ, నిర్బంధవిధాననమునూ సాగించ కుండా అధికారులను అరికట్టేహక్కూ —— ఇవి సాధారణంగా చెప్పబడే హక్కులు. ఇవి ఏదో ఒక ప్రత్యేకఅన్యాయ నివృత్తికోసం ఏర్పాటుచేయబడినవి కావు. ముఖ్యంగా ప్రభు త్వము చేయడానికి వీలున్న అన్ని అన్యాయాలనూ ఆదిలోనే అరికట్టడానికి పనికి వచ్చేవి.

ఈ హక్కులను మానవజీవితంలో అవి వహించే పాత్రను బట్టి తాత్త్వికదృష్ట్యాకూడా పరిశీలించవచ్చును. పన్నుల భార మునూ, ముద్రణాలయనిరోధాలనూ అన్యాయాలు అనీ, వ్యక్తి గతఆస్తినీ, భావస్వాతంత్ర్యాన్నీ హక్కులు అన్నీ ఎందుకు అనాలి అని ఇక్కడ ఒకప్రశ్న రావచ్చును. ఈప్రశ్న ఈహక్కులకూ, అన్యాయాలకూ సంబంధించిన హేతువాదమునుపరిశీలించి న్యాయనిర్ణయానికి ఒకప్రమాణాన్నిఏర్పరచడానికికూడా పనికి

వస్తుంది. ఈ ప్రాథమిక స్వత్వసిద్ధాంత స్రష్టలూ, నేటికీ ఈసిద్ధాంతమును విశ్వసించేవారూ – అందరూ ఇట్టి ప్రమాణం ఒకటి ఉన్నదని భావిస్తున్నారు. మానవజీవితానికి ఒక ప్రయోజనం ఉన్నదనీ ఆ ప్రయోజనాన్ని సాధించడానికి కృషిచేయడం మానవుని ధర్మమనీ ఈ ప్రమాణముయొక్క ముఖ్యభావం. ఈ ప్రయోజనాన్ని సాధించడానికి మానవవ్యక్తికి అవసరములైన పరికరాలే ఈ హక్కులు. ఇంక ప్రాథమిక హక్కులు అంటే ఈ హక్కులలో తప్పకుండా ఉండి తీరవలసినవీ, ముఖ్యమైనవీ అని అర్థం. సార్థకమైన బ్రతుకు బతుకదలచుకొన్న ప్రతి మానవునకూ అవి ఉండితీరాలి. వ్యక్తుల ఇష్టానిష్టములతో వీటికి పనిలేదు. 18 వ శతాబ్దంలో వేదాంతు లందరికీ మానవుడు సాధించవలసిన ఈ ప్రయోజనం సౌఖ్యమే అన్న అభిప్రాయం ఉండేది. ఆస్తిపాస్తులకు భద్రతా, 'ఆరాధనాస్వాతంత్ర్యమూ, భావనాస్వేచ్ఛా, వ్యక్తి స్వాతంత్ర్యమూ, ప్రభుత్వ దృష్టిలో సర్వసమానమైన హోదా – ఇవి అన్నీ ఉంటేనేగాని ఏ మానవుడూ ఆ సౌఖ్యాన్ని సాధించలేడు అనికూడా వారి ఉద్దేశం. కనుకనే వీటిని ప్రాథమికస్వత్వాలు అన్నారు. కాని ఆధునిక తాత్త్వికులలో చాలామంది మానవుడు తన నైతికవ్యక్తిత్వమును వృద్ధిచేసుకొని సాధ్యమైనంతలో సర్వోత్తమస్థితిని పొందటానికి కృషిచేయడమే అతడు సాధింపదగిన పరమలక్ష్యం అని ప్రవచిస్తున్నారు కనుక ఈ ప్రయోజనమును సాధించడానికి అవసరములైన సాధనాలన్నీ ఈపట్టికలో చేరాలన్నమాట. హక్కులనుగురించి ఇలా అభిప్రాయపడటం వలన మానవస్వత్వములలో జోక్యం కలిగించుకొని అధికారం

చెలాయించడానికి ప్రభుత్వానికి హక్కులేదు అనే విషయం తేలుతుంది. ఎందుకంటే, అలాకాక ఈ హక్కే ప్రభుత్వాని ఉంటే, అది మానవుడు తానుఏర్పరచుకొన్న నైతిక ఆదర్శాన్ని పొందడానికి అతనికి అవకాశమీయక, అతని స్వాతంత్ర్యాన్ని అరికడుతుంది. అపారాధికారమును చెలాయించే నిరంకుశపద్ధతికి విలువ లేకుండా పోతుంది.

ప్రధానములైనవిగా పరిగణింపబడే ఈ స్వత్వములను ఆ విప్లవయుగంలోకూడా కొందరుపండితులు పవిత్రమైన వనీ, ప్రకృతిసిద్ధములైన వనీ, అనితరదత్తము లనీ, అనివార్యము లనీ వర్ణిస్తూఉండేవారు. ప్రసిద్ధమైన అమెరికను స్వాతంత్ర్యప్రకటన పత్రికలోనూ మానవునియొక్క, పౌరునియొక్క స్వత్వములను నిర్వచించిన ఫ్రెంచి ప్రకటనపత్రములోనూ ఈ విశేషణాలు కొన్ని వాడబడినాయి. ఈ విశేషణాలలో ప్రతిదానికీ ప్రత్యేకప్రాముఖ్య మున్నది. పవిత్రమైనది అనడంలో ఈ హక్కులు భగవత్ప్రసాదములు అనీ, ప్రభుత్వాలయొక్కగాని, శాసననిర్మాతలైన మానవులయొక్కగాని అనుగ్రహముపై ఆధారపడినవి కావనీ అర్థం. ప్రకృతిసిద్ధము లనడంలో మానవ స్వభావంలో ఆదినుంచీ అవి స్వతస్సిద్ధములుగా ఉన్నా యనీ, హేతువాదసిద్ధము లనీ (18-వ శతాబ్దపు పండితులు ప్రకృతి సహజత్వమూ హేతువాదము అనే ఈ రెండుశబ్దాలనూ సమానార్థకములుగానే వాడేవారు) భావం. అనితరదత్తములనడంలో అన్నియుగములలోనూ సార్వకాలికములుగా వర్తిస్తాయని అభిప్రాయం. అనివార్యములు అనడంవలన మానవుడు అవి లేకుండా మనలేడు అనీ, ఉన్నా, మానవ శబ్దవాచ్యుడుగా

ఉండలే డనీ ఉద్దేశ్యం. ఈ దృష్ట్యా ఈ హక్కులు నిరంకుశ యుగంలో సహజంగా ఉంటూఉన్న పాలకపాలితసంబంధ బాంధవ్యాలను తారుమారు చేస్తాయి. రాజులు అన్ని విధము లైన హక్కులూ మాకే ఉండాలి అంటూ ప్రజలకుమాత్రం సర్వవిధములైన విధులనూ, బాధ్యతలనూ కట్టపెట్టడానికి బదులు ఇప్పుడు ప్రజలే కొన్ని హక్కులను కలిగిఉండటంవలన ఆ హక్కులను ఆమోదించి, వాటిని గౌరవించి ఏవిషయంలోనూ వాటిలో జోక్యం కలుగజేసికొనవలసివచ్చు. ఏ కార్యక్రమం లోనూ చేయి చేసికొనకుండా దూరంగా ఉండటం ప్రభుత్వాలకు విధి అయింది. ఇలా క్రమంగా నిరంకుశపద్ధతి మారి కొన్ని నిర్ణీతాధికారాలను మాత్రమే కలిగిఉండే సూత్రబద్ధ ప్రభుత్వ విధానం (Constitutionalism) అమలులోకి వస్తుంది. ఇదే ఈ ప్రాథమిక స్వత్వసిద్ధాంతముయొక్క ఆచరణయోగ్యత లోని ప్రత్యేకత.

ఈ స్వత్వముల స్వభావమును ఏ దృష్టితో చూచినా, ఈ సిద్ధాంతము నిర్వికల్పమై కరడుగట్టిన సిద్ధాంతం కాదనీ దానిని యథోచితంగా మార్పుచేసికొనడానికీ అవకాశం ఉన్న దనీ గ్రహించాలి. ఈ సిద్ధాంతముయొక్క ఉత్తమలక్షణా లలో ఇది ఒకటి. క్రొత్త క్రొత్త అన్యాయాలు అనుభవంలోకి వచ్చినప్పుడల్లా క్రొత్త క్రొత్త నివారణోపాయాలూ, వాటితో పాటు క్రొత్తహక్కులూ సృష్టింపబడతాయి. ప్రాతఅన్యాయాలు కొన్ని తొలగిపోగానే, వాటితోపాటు కొన్ని ప్రాత హక్కుల ఆవశ్యకతకూడా తీరిపోతుంది. దీనివలన ఈ ప్రాథమికస్వత్వముల జాబితా కాలానుగుణంగా మార్పుచేయబడడ

మెందుకో అర్థమవుతుంది. ప్రథమ ప్రపంచసంగ్రామానంతరం తయారుచేయబడిన రాజ్యాంగవిధానాలలో, 18, 19 వ శతాబ్దాలలో తయారైన రాజ్యాంగ విధానాలలో లేని క్రొత్త హక్కులెన్నో చేర్చబడ్డాయి అన్న విషయాన్ని పై విషయానికి ఉదాహరణగా చెప్పవచ్చును. ఈ హక్కుల జాబితాను మానవాదర్శోపలబ్ధికి ఇదియొక సాధనము అన్న దృష్టితో చూచినప్పటికీ ఈ ఆదర్శాలు శాశ్వతాలుకావు గనుక యుగయుగానికీ అది మారుతూ ఉండవలసినదే. లాస్కీ చెప్పినట్లు: "స్వభావసిద్ధములైన ఈ మన హక్కులు ఇలా ఆంతరంగిక పరిణామానికి లోనవుతూ ఉండటానికి కారణము ఈ ప్రపంచము మార్పులేని స్థాణువు కాకపోవడమే." ఎలాచూచినా ఈ సిద్ధాంతానికి కొందరు విమర్శకులు అంటగట్టిన కార్కశ్యము మాత్రం దానిలో ఏమాత్రమూ కనిపించడంలేదు.

ఈ ప్రాథమిక స్వత్వముల జాబితాలో ప్రజలే తమ పాలకులను ఎన్నుకోవాలి అనే హక్కుకు ప్రథమస్థానం ఈయడం యుక్తంగానే ఉంది. నిరంకుశయుగమునాటి చక్రవర్తుల నియంతృత్వానికి మూలకారణమైన విష్ణ్వంశవాదానికి సమాధానంగా ఈ హక్కువచ్చింది. ఈ ప్రాథమికస్వత్వాన్ని బలపరచే వాదోపవాదాలను ఇక్కడ ఉటంకించడం అనవసరం. పాలితప్రజలవద్దనుండి వారి అంగీకారముతో సంపాదించిన అధికారమూ, బలమూ కలిగిన ప్రభుత్వము మాత్రమే ప్రజల హక్కులను సంరక్షించి వారి సౌభాగ్యాన్నీ, సౌఖ్యాన్నీ పెంపొందించడానికి కృషిచేస్తుంది అనే ముఖ్యవిషయం మానవుని హక్కులనుగూర్చి ఫ్రెంచి ప్రభుత్వం తయారుచేసిన ప్రక

టనపత్రంలో ఈ హక్కును గురించి ఇలా వ్రాశారు "సర్వ ప్రభుత్వాధికారానికి మూలాధారం ప్రజలు, ఒకవ్యక్తిగాని, కొందరు వ్యక్తుల సమూహంగాని ఆ ప్రజలవద్దనుండి తమకు సంక్రమించని అధికారాలను వారిపైన చెలాయించడానికి వీలు లేదు" ప్రభుత్వం మానవకల్పితమే అనీ, అది మానవుడు తన ప్రయోజనములను సాధించుకోటానికిగాను స్వయంగా తయారు చేసికొనిన ఉపకరణము అనీ అతని అవసరములు మారినప్పుడల్లా వాటితోపాటు ఈ ఉపకరణాన్నికూడా దానికి తగినట్టు అతడు మార్పుచేసికొనవచ్చుననీ స్పష్టపరచడం వలన ప్రభుత్వాధికారమూలస్థానమునుగూర్చిన ఈఅభిప్రాయం విప్లవంశావాదమును వెనుద్రొక్కి తాను ముందడుగువేసిన దని స్పష్టంగానే తెలుస్తూంది.

పాలింపబడే ప్రజలే ప్రభుత్వాన్ని నిర్మించుకొనడంగాని, నిర్మూలించడంగాని చేయవచ్చును అనే ఈ భావం వెల్లడిలోనికి వచ్చిన మొదటిరోజులలో నిరంకుశచక్రవర్తుల పాలనలో ఉన్న దేశాల ప్రజలకు ఇది ఏమిటో విచిత్రంగా ఉండేది. కాని 17,18 శతాబ్దాలలో జరిగిన సంఘటనలవలన ఈభావంతో వారికి బాగా పరిచయం ఏర్పడింది. క్రమంగా దీన్ని సర్వజనాంగీకృతమైన సామాన్యస్వత్వంగా భావించేవారు. మొదట ఇంగ్లండు దేశపురాజు ప్రథమ ఛార్లెసు యుద్ధరంగంలో ఓడిపోయి ఉరితీయ బడగానే ప్రజలకు ఈ విజయాన్ని సాధించి పెట్టిన వీరులు పాత ప్రభుత్వాన్ని కూలద్రోసి దానిస్థానంలో క్రొత్తప్రభుత్వాన్ని నెలకొల్పవలసి వచ్చింది. ఇలాటి పరిస్థితే 1688 నాటి 'మహావిప్లవము'లో రెండవ జేమ్సును పద

భ్రష్టునిచేసి మూడవ విలియమునూ, మేరీనీ ఆహ్వానించి వారికి ప్రభుత్వాన్ని కట్టబెట్టినప్పుడూ సంభవించింది. 1776 లో అమెరికాఖండంలోని 13 బ్రిటిషు అధినివేశరాష్ట్రాలూ ఆంగ్లరాజరికానికి స్వస్తిచెప్పి క్రొత్త ప్రభుత్వాల నేర్పాటు చేసికొన్నాయి తరువాత 11 సంవత్సరాలకు బలవత్తరమైన పూర్వపద్ధతికంటె స్థిరమైన సమాఖ్య (Union) ఒకటి అవసర మని తోచగానే వారు మొదట ఏర్పరచుకొన్న సమ్మేళనము Confederation ను రద్దుచేసి దాని స్థానంలో ఒక సక్రమ సంయుక్త రాజ్యాంగ పద్ధతిని తయారుచేసికొన్నారు. ఫ్రాన్సులో 1789 లో సమావేశ మయి పౌర మానవస్వత్వము లను వివరిస్తూ ప్రసిద్ధప్రకటనచేసిన జాతీయపరిషత్తు విష్వంశ వాదియైన 16వ లూయీయొక్క చక్రవర్తిత్వాన్ని కూల ద్రోసి దానిస్థానంలో రాజ్యాంగసూత్రబద్ధమైన ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని నెలకొల్పింది ఇలాంటి సంఘటనల వలన చక్ర వర్తులు విష్వంశసంభూతులు కావడం వలననే వారికి సర్వాధి కారాలు సంక్రమిస్తాయన్న విశ్వాసం క్రమంగా మాసిపోయి దానికి బదులుగా ప్రభుత్వాన్ని నెలకొల్ప డానికీ, నిలబెట్ట డానికీకూడా ప్రజలే అధికారులు అనే భావం బాగా వ్యాప్త మయింది. యూరపులోనూ, అమెరికాలోనూ కొంచెం ఇంచు మించు ప్రతిదేశంలోనూ కనీసం ఒక మారైనా విప్లవం వచ్చింది. 1789 కి తరువాత జరిగిన విప్లవాలన్నీ ఈ ప్రథమ ప్రాథమికస్వత్వముయొక్క సత్యాన్నీ, యోగ్యతనూ స్థిరపరి చాయి. ఈ నాడు ప్రతిప్రజాస్వామిక దేశంలోనూ ప్రజలే ప్రభుత్వాలను సృష్టించడమూ, కూలద్రోయడమూ పరిపాటిగా

జరిగిపోతూంది. సాధారణ ఎన్నికలు జరిగినపుడల్లా ఈ హక్కును ప్రజలు వినియోగిస్తున్నారు ఇప్పుడు ప్రజాస్వామ్యరక్షణ కొరకూ, వ్యాప్తికొరకూ పోరాడుతున్న వారందరూ నిజమునకు ఈ ప్రాథమికహక్కును రక్షించడానికీ, వ్యాప్తిచేయడానికీ పోరాడుతున్నారు.

ప్రజలు పరిపాలకులను తమయెడ బాధ్యతగలిగి ప్రవర్తించేటట్లు చేసుకోవాలి అనే హక్కు ఈ ప్రాథమిక స్వత్వాలలో రెండవది "ప్రతిజాతీ తన ప్రతినిధులనుంచి వారి ప్రవర్తనకు సంజాయిషీ ఇవ్వవలసినదని కోరడానికి అధికారం కల్గి ఉండాలి" అని ఫ్రెంచి ప్రకటనపత్రంలో ఒకవాక్యం. తాము న్యాయంగా పరిపాలించాలి అనే ధర్మనిర్వహణలో లోటుపాట్లకు తాము భగవంతునికే సమాధానం చెప్పుకోనవలసి ఉంటుందిగాని, ఎంతటి దుర్మార్గుడైన రాజునైనా మానవమాత్రులు విచారించడానికీ వీలులేదు అని నిరంకుశ చక్రవర్తులు చెప్పుతూఉండిన ధర్మానికి ప్రతిగా ఈ హక్కు ప్రకటింపబడింది. ఈ ప్రభువుల ధర్మాచరణలో జరుగుతూఉండిన అన్యాయాలే, ప్రభుత్వచర్యలను విమర్శించడానికీ, వారిచర్యలకు వారినే బాధ్యులను చేయడానికీ, ప్రజలకు హక్కు ఉన్నదనీ, ఒకవేళ వారిచర్యలు ప్రజాభీష్టమునకు వ్యతిరేకాలుగా ఉన్నాయని తేలితే, వారిని తొలగించి తాము వేరే ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకొనవచ్చుననీ ప్రజలు స్పష్టంగా ప్రకటించడానికి కారణాలయాయి.

భావనా, అభిప్రాయప్రకటనా, స్వాతంత్ర్యము అనే మరొక ప్రాథమికస్వత్వముయొక్క సంపూర్ణ వైలక్షణ్యాన్ని

అవగాహన చేసికొనడానికి పైనచెప్పిన హక్కుతో దానికిగల సంబంధాన్ని బాగా గుర్తించాలి. ఫ్రెంచి ప్రకటనపత్రంలోని మాటల్లోనే చెప్పాలంటే "అనిరుద్ధభావప్రకటనాస్వాతంత్ర్యం మానవుని అమూల్యస్వత్వములలో ఒకటి గనుక, ప్రతి పౌరుడూ యథేష్టముగామాటలాడవచ్చును, వ్రాయవచ్చును, ప్రకటించవచ్చును. అయితే ఈ స్వాతంత్ర్యం దుర్వినియోగం చేయబడి, న్యాయవిరుద్ధ మని నిరూపింపబడినప్పుడు దానికి అతడే బాధ్యత వహింపవలసి ఉంటుంది." పాలితప్రజలు ప్రభుత్వ నిర్వహణపద్ధతిని గురించి తమ అభిప్రాయములను స్వేచ్ఛగా వెల్లడించే అవకాశం లేకపోతే పాలితులయెడ పాలకులకుగల బాధ్యత యథార్థమైనదీ, సమర్థమైనదీగా ఉండదు. 18 వ శతాబ్దమందలి విద్వాంసులు ఈ హక్కునకు చాలా ప్రాముఖ్యము నిచ్చారు. దీనికి కారణం ఆరోజులలో ముద్రణాలయ నియమావళియొక్క తీవ్రత ఒక్కటే కాదు. విప్లవాలు జరిగి, ప్రజాప్రతినిధి రాజ్యాంగవిధానం ఏర్పాటుచేసుకొన్న దేశాలలోకూడా అప్పటికి ఇంకా ప్రజలలో బహుసంఖ్యాకులకు నియోజనాధికారం (వోటింగుహక్కు) లభించలేదు. ఈ నియోజనాధికారం గల స్వల్పసంఖ్యాకులే తమ నియోజనాధికారాన్ని ప్రయోగించి ఒక పాలకవర్గమును తొలగించి మరొక మరొకదానిను నిలబెట్టగలిగేవారు, కాని ఈ నియోజనాధికారంలేని తక్కిన ప్రజలందరికీ ఈ అవకాశం ఉండేదికాదు. అందువలన వారి సౌకర్యాలకు రక్షణ ఉండాలంటే, అధమం భావప్రకటనా స్వాతంత్ర్యం అనే ఈ ఒక్క హక్కు అయినా వారికి ఉండితీరాలి. దానివలన వారు ప్రభుత్వచర్యలను విమ

ర్శించి ప్రజలలో ఆ విషయమై ఆందోళనచేసి ప్రభుత్వానికి ఒత్తిడి కలిగింపగలుగుతారు ఇలా ఈ హక్కు దేశంలో అన్ని శాఖలవారికీ చాలా అమూల్యమైనదే అయినా వోటింగు హక్కు లేనివారికి అది మరెంతగా అమూల్యమైనది అని చెప్ప వచ్చు. అసలు ప్రజాప్రతినిధి ప్రభుత్వాలే లేని దేశాలలో కూడా ప్రభుత్వం నిర్బంధవిధానం అవలంబించకుండా నిరో ధించడానికి ఈ అభిప్రాయప్రకటనా స్వాతంత్ర్యమే ఏకైక ప్రబలసాధనం.

దుష్పరిపాలనకూ నిర్బంధవిధానానికీ దిగిన పరిపాలకు లను ప్రతిఘటించడానికి ప్రజలకుగల హక్కు ఈ ప్రాథమిక స్వత్వాలలో మరొకటి. నిరంకుశపాలకులూ వారిని సమర్థించే వారూ చెప్పే ప్రశాంత విధేయతాసిద్ధాంతానికి ఇది ప్రతి కల్పన. 1688లో ఆంగ్లవిప్లవమును సమర్థించిన తాత్త్వికుడు లోకే పండితుడు ఈ ప్రతిఘటనా సిద్ధాంతానికి సంబంధించిన హేతువాదమునూ, దానికి వ్యతిరేకంగా చెప్పడానికి వీలున్న అభ్యంతరాలకు తగిన సమాధానాలనూ విశదంగా సమర్థ నీయంగా స్పష్టీకరించాడు. "ప్రభుత్వంయొక్క ఆదర్శం మానవకళ్యాణం. ప్రజలు ఎల్లప్పుడూ అంతులేని నిరంకుశ విధానానికి పాల్పడే స్థితిలోనే ఉండటమా? లేక పరిపాలకులు తమ అధికారాన్ని అమితంగా దుర్వినియోగంచేసి దానితో ప్రజలయొక్క ఆస్తిపాస్తులను రక్షించడానికి బదులు భక్షించ డానికి పూనుకొన్నప్పుడు వారిని నిరోధించే అవకాశం ప్రజ లకు ఉండటమా?— మానవలోకానికి ఏది ఉత్తమ మైనదో యోచించండి. పోనీ దీనివలన ఎవడుపడితేవాడు ప్రభుత్వాలను

తల్లక్రిందులు చేయడానికి దురాలోచనలను తేలిగ్గా ప్రారంభిస్తాడు అని ఎవరైనా గట్టిగా చెప్పగలరా? అలా ప్రారంభించేవాడు ఎవడైనా, ఎక్కడైనా బయలుదేరితే బయలుదేరవచ్చునుగాని అది చివరకు అలా బయలుదేరినవారి వినాశానికే, విచ్ఛిత్తికే కారణం అవుతుంది. నిజానికి పరిపాలకుల దురుద్యోగం బాగా వెల్లడయి, వారి దౌష్ట్యం పెరిగి బాగా అనుభూతం అయేవరకూ – ప్రభుత్వాన్ని ప్రతిఘటించి తమ హక్కులను కాపాడుకోనడానికంటె ఎలాగో నిర్బంధవిధానాన్ని అనుభవించడానికే ఎక్కువగా సిద్ధపడే స్వభావంగల ప్రజలు– నడుముకట్టి బయలుదేరరు. ఎక్కడో, ఎవడో ఒకఅభాగ్యుడికి ప్రత్యేకంగా ఏదో అన్యాయం జరిగిన దన్నంత మాత్రాన ప్రజలు కోపోద్రిక్తులు కారు. కాని మొత్తముమీద వారందరి యొక్కస్వేచ్ఛనూ అపహరించడానికి వ్యూహములుతయారవుతున్నా యనడానికి వారికి ప్రత్యక్షసాక్ష్యం దొరికి, ప్రభుత్వపద్ధతులూ, విధానాలూ పరిపాలకుల దురాలోచనలకే నిదర్శనాలుగా ఉంటూ, తీవ్రములైనఅనుమానాలకు కారణభూతములైతే దానికి ఇంక బాధ్యు లెవరు? అనుమానాలకు అవకాశాలను లేకుండా చేయవలసినవారే అనుమానాస్పదులైనప్పుడు ఎవ రేమిచేయగలరు?''

ఆయుధధారణస్వాతంత్ర్యమును గూర్చిన ప్రాథమికస్వత్వానికి ఈ నిర్బంధవిధానప్రతిఘటనాస్వత్వంతో సంబంధం ఉంది. చక్రవర్తుల అధీనంలో ఎప్పుడూ సుశిక్షితములైన సాయుధసైన్యాలు ఉంటాయి. ఇంగ్లండు మొదలైన కొన్ని దేశాలలో వారు శాంతిసమయాలలో అలాంటి సైన్యా

లను ఉంచుకోనకుండా చేయడానికి ప్రయత్నాలు జరిగినా, ముఖ్యంగా యుద్ధాలు తరచు కావడంవల్ల అది సాధ్యపడలేదు. ఈ పరిస్థితుల్లో నిరాయుధులైన ప్రజల ప్రతిఘటనను అణచి వేయడం చాలా సులువైన పని అయింది. ప్రతిఘటనా స్వాతంత్ర్యం అనే ప్రాథమికస్వత్వము కేవలం కాగితము మీద కనిపించే హక్కు-గానే ఉండిపోక, అనుభవయోగ్యంగా ఉండాలంటే దీనికి సహాయకారిగా ప్రతిపౌరునికీ ఆయుధ ధారణస్వాతంత్ర్యమూ, ఆయుధశిక్షణ పొందేహక్కు-కూడా విధిగా ఉండాలి. వాక్స్వాతంత్ర్యంలాగానే ఈ హక్కు-కూడా నియోజనాధికారం లేని ప్రజలకు ఎక్కు-వ ప్రయోజనకారి. దానికి ఎంత విలువ ఉన్నదీ సంయుక్తరాష్ట్రాలలో జరిగిన సంఘటనవలన వ్యక్తం అవుతూంది. ఆ దేశపు రాజ్యాంగశాసనంలో ప్రాథమికస్వత్వాలనుగూర్చిన విభాగమే లేకపోవడం వలన అది నిర్దుష్టమైనదికాదు అన్నారు. ఆ శాసనానికి మొదట చేర్చిన పది సవరణలతో ఈ లోటును పూర్తిచేసిన తరువాత రెండవ పర్యాయం చేసిన సవరణలలో "ప్రతి స్వతంత్ర రాష్ట్రముయొక్క- భద్రతకు ఒక సుశిక్షితసైన్యం లవసరము, కనుక ఆయుధములను ధరించుటకూ, వాడుటకూ ప్రజలకుగల హక్కు- అపహరింప బడదు" అని విశదంచేశారు. ఇంగ్లండు స్వత్వశాసనంలోకూడా—అది ప్రొటెస్టెంటులకు మాత్రమే వర్తిస్తుం దనుకోండి – ఇలాంటిదే ఒకవాక్యం ఉంది.

శాసననిర్మాణంలో ప్రతిమనిషికీ స్థానం ఉండాలి అనేది మరో ప్రాథమికస్వత్వం. ఫ్రెంచివారి ప్రకటనపత్రంలో ఇలా ఉంది. "శాసనమంటే దేశప్రజల అభిమతానికి రూప

కల్పన. స్వయంగాగాని, తన ప్రతినిధి ద్వారాగాని శాసన నిర్మాణంలో పాల్గొనడానికి ప్రతిపౌరునకూ హక్కు ఉన్నది.” ఈ స్వత్వమును అంగీకరిస్తే, శాసనా లన్నీ సాంఘిక అనుభవాన్నీ, సాంఘికావసరాలనూ ప్రకటించేవీ, దేశంలోని ప్రతి వర్గముయొక్క మంచిచెడ్డలనూ కనిపెడుతూ వారికి రక్షణ ఇచ్చేవీ అవుతాయి అని పూర్తిగా ధ్రువపడుతుంది ఇది సర్గ శాసనానికి ప్రతిగా పనిచేస్తుంది.

ఇంతవరకు చెప్పబడిన స్వత్వసముదాయాన్ని మానవుని రాజకీయ సార్వజనీనస్వత్వములు అని అనవచ్చును. ప్రభుత్వ నిర్మాణంలో అతని స్థానాన్నీ, అతని కర్తవ్యాన్నీ గురించి మాత్రమే అవి వివరిస్తాయి. ఈ హక్కులను అంగీకరించడమే 19, 20 వ శతాబ్దాలలో ప్రపంచంలో చాలాభాగంలో ప్రజాస్వామిక ప్రభుత్వపద్ధతి వ్యాపించడానికి కారణ మయింది. ఈ హక్కులకంటే భిన్నమైనవీ, వ్యక్తిగతమైనవీ, - వ్యక్తిగత పౌరస్వత్వములు అని పిలువదగినవీ, మరొక స్వత్వసముదాయం ఉంది. సంగ్రహంగా చెప్పాలంటే అవి 1. వ్యక్తిస్వాతంత్ర్యము, 2. మతవిశ్వాస, ఆరాధనా స్వాతంత్ర్యము, 3. భావనా, అభిప్రాయ ప్రకటనాస్వాతంత్ర్యము, 4. ఆస్తినికలిగిఉండటానికీ, అనుభవించడానికీ స్వాతంత్ర్యము, 5. సర్వసమానత్వమునకు సంబంధించినహక్కు. ఇవే 18 వ శతాబ్దంలో ఈసిద్ధాంతానుయాయులంతా ఈ ప్రాథమికస్వత్వాలను లిఖిత రాజ్యాంగ విధానాలలో చేర్చాలని చెప్పినప్పుడు వారిమనస్సులలో ఉన్న ప్రాథమికస్వత్వాలు. ముఖ్యంగా వీటికే 19 వ శతాబ్దంలో యూరప్‌లోనూ, అమెరికాలోనూ చాలాదేశాలలో చెల్ల

రేగిన విప్లవాలకు ఫలితంగా ఏర్పాటు చేయబడిన రాజ్యాంగ విధానాలలో – స్థానం ఈయబడింది.

ఈ హక్కులలో మొదటి మూడింటికీ వ్యాఖ్యానం అనవసరం మానవస్వత్వములను గురించిన ఫ్రెంచిప్రకటన పత్రంలో వాటి విషయమై ఇలా ఉంది "న్యాయశాస్త్రరీత్యా నిర్ణయింపబడి అన్యాయశాస్త్రోక్తవిధానమున విచారింపబడితేనే తప్ప, ఏ మానవుణ్ణీ నేరస్థునిగా భావించడంగాని, అరెస్టు చేయడంగాని, కారాగృహంలో ఉంచడంగాని చేయరాదు. అశాస్త్రీయములైన నిరంకుశాజ్ఞలను చేసినవారుగాని, వాటిని ప్రోత్సహించినవారుగాని, సహాయపడినవారుగాని, వాటిని అనువర్తించినవారుగాని, అనువర్తించుటకు కారకులైనవారు గాని శిక్షింపబడవలెను న్యాయశాస్త్రరీత్యా ఆజ్ఞాపింపబడిన లేక బంధింపబడిన ప్రతిపౌరుడూ వెంటనే ఆ ఆజ్ఞలను శిరసా వహించవలెను ప్రతిఘటించినచో స్వయంగా నేరంచేసినవాడు అవుతాడు." "న్యాయశాస్త్రము సంపూర్ణముగానూ, స్పష్టము గానూ అత్యంతావశ్యకములైన శిక్షలను మాత్రమే విధించ వలెను నేరము జరగడానికి పూర్వమే అమలులోనున్న న్యాయ శాసనముల ననుసరించి తప్ప ఎవరినీ శిక్షింపరాదు." "దోషిగా నిర్ధారణ చేయబడకపూర్వం ప్రతిమానవుణ్ణీ నిరపరాధిగానే భావిస్తూ అతనిని నిర్బంధావాసంలో ఉంచడం తప్పనిసరి అయినప్పుడుకూడా వ్యక్తిని అదుపులో ఉంచడానికి అవసరమైన కాఠిన్యముకంటె ఎక్కువ కాఠిన్యమును ప్రదర్శించకుండా న్యాయశాస్త్రం శాసించాలి." ఈ విభాగాలు వ్యక్తిస్వాతంత్ర్యాన్ని వివరించేవి.

మతవిశ్వాస, ఆరాధనాస్వాతంత్ర్యాలకు సంబంధించిన స్వత్వమునుగూర్చి ఆ పత్రంలోని మరొక విభాగములో ఇలా చెప్పబడింది, "కొన్ని అభిప్రాయములను కలిగి ఉన్నందులకు ఏ మనిషినీ ప్రభుత్వం బాధించకూడదు. మత సంబంధములైన ఎట్టి అభిప్రాయాలను కలిగిఉన్నా ఏ వ్యక్తినీ బాధించరాదు. అయితే అతని అభిప్రాయాలవలన న్యాయశాస్త్రముచే స్థాపింపబడిన ప్రజాశాంతికి ఏవిధమైన భంగపాటూ కలుగరాదు. భావనా, అభిప్రాయ ప్రకటనా స్వాతంత్ర్యమునుగూర్చి ఫ్రెంచి ప్రకటనపత్రంలో వివరింపబడిన విషయాలు పైన మరొక సందర్భంలో వివరింపబడినాయి.

ఈ పౌరస్వత్వాలలో ప్రధానస్థానం ఆస్తికి సంబంధించిన స్వత్వానిది. చక్రవర్తి నిరంకుశత్వం చివరకు తమ ప్రజలను బలవంతముగా, భరింపనలవిగాని పన్నులను విధించి పీడించడముగా ఎలా పరిణమించినదీ ఇదివరకు స్పష్టంచేయబడినది. వ్యక్తిగతమైన ఆస్తిహక్కు ఉండాలని వాదించేవారెవరూ ప్రభుత్వం పన్నులు వసూలుచేయరాదని వాదించలేదు. ప్రజా సైన్యముయొక్క జీవనాధారముకొరకూ, ప్రభుత్వ నిర్వహణకూ, ఇతర ఖర్చులకోసమూ ప్రజలందరివద్దనుంచీ కొంతసొమ్ము వసూలుచేయడం అవసరమని ఫ్రెంచి ప్రకటనపత్రంలోనే ఉంది విపరీతపు పన్నులనూ, నిర్బంధపు ఋణములనూ వసూలు చేయడమునూ, వ్యక్తులకుచెందిన ఆస్తిహక్కులను వారికి ఏవిధమైన ప్రతిఫలమూ ఇవ్వకుండానే రద్దుచేయడమునూ, ప్రజలవద్దనుంచి పన్నుగా వసూలుచేసిన మొత్తాలను వారికి ఏ విధంగానూ ఉపకరించని విధంగా ఖర్చుచేయడమునూ

మాత్రమే వారు ప్రతిఘటించారు. కొంచెం భాషాడంబరం ఉన్నా దామస్ పెయిన్ చెప్పిన ఈ క్రింది వాక్యాలలో సత్యం లేకపోలేదు ఆయన ఇలా అన్నాడు – "అన్ని దేశాల లోనూ ప్రభుత్వపు సొమ్మును విభజించి వెచ్చించు అధికారము గల ప్రభుత్వాధిపతులందరికీ నోములపంట–యుద్ధం అది వారు 'ఇంట గెలవడానికి' ప్రయోగించే కళాకౌశలం, దాని ప్రయోజనం రెవిన్యూఆదాయాన్ని వృద్ధిపరచడం, పన్నుల నెక్కువ చేయకుండా ఈపని సాధ్యంకాదు. గనుక, ఖర్చుకోసం ఏదైనా ఒక వంక చూపించాలి, ఏవిధమైన దురభిమానంగాని, ద్వేషం గాని లేక సత్యాన్నిమరుగుపరచని విదేశీయుడు ఎవడైనా ఆంగ్ల ప్రభుత్వచరిత్రనూ,యుద్ధాలనూ పన్నులవిధానమునూపరిశీలించ డము జరిగితే, అతడు యుద్ధాలను సాగించడానికిగాను, పన్నులు వసూలుచేయబడవనీ, పన్నులను విధించడానికే యుద్ధాలు సృష్టింపబడతాయి అనీ స్పష్టంగా ప్రకటించ గలుగుతాడు" మరొకవిషయాన్ని కూడా జ్ఞాపకం వుంచుకోవాలి. ఈ నిరంకుశపరిపాలనాయుగములోనూ, తరువాత చాలా కాలము వరకు కూడా ప్రతివ్యక్తీ తనస్వంతఆదాయముమీదనే ఆధారపడి జీవించాలి అని అభిప్రాయపడుతూ వుండేవారు. నిరుద్యోగసమస్యకుగాని, వార్ధక్యపు పెన్షనులకుగాని ఏ విధమైన సదుపాయాలులేవు, పేదవారిస్థితి చాలవిచారకరంగా ఉండేది. అందువలన ఈ అశాస్త్రీయములూ, అసంఖ్యాకములూ అయిన పన్నులకు గురిచేయబడే యెడల చాలామంది ప్రజలకు భద్రముగా జీవించగలగడం అసంభవం అవుతుంది. వ్యక్తిగతమైన ఆస్తులకు సంబంధించిన హక్కును పవిత్రమైనదిగానూ, అను

ల్లంఘనీయమైనదిగానూ భావించడానికీ ఇదిఒక కారణం. మరొక కారణంకూడా ఉంది ప్రభుత్వాలు వర్తక వ్యాపార స్వాతంత్ర్యాలను అరికట్టే అనేక నిబంధనలను విధించాయి. గొప్ప లాభాలుపొంది ఐశ్వర్యవంతు లవడానికి వ్యాపారస్థులకు అనేక అవకాశాలు లభిస్తున్నా, వాటిని వినియోగించుకొనే అవకాశం వారికి లేకుండా పోయింది. అందువలన ప్రభుత్వమంటే వారికి, - తాము కష్టపడి ఆర్జించుకొన్న సంపదను స్వేచ్ఛగా అనుభవించనీయకుండా తాను జోక్యం కలుగజేసుకొనేదీ, పైగా తన తెలివితక్కువ పద్ధతులవలనా, పనులవలనా వారు క్రొత్తగా ఆస్తులను సంపాదించుకొనకుండా నిరోధించేదీ అని అర్థమయింది. ఈ లాంటిపరిస్థితుల వల్లనే ఆస్తిహక్కుకూడా ప్రాథమిక స్వాతంత్ర్యాలలో చేర్చబడింది

విప్లవకాలుల ప్రాథమికస్వాతంత్ర్య ప్రణాళికలలోని మరొక హక్కు సర్వసమానత్వమునకు సంబంధించినది. అమెరికను స్వాతంత్ర్య ప్రకటన పత్రంలో "మానవులందరూ సమానులుగానే సృజింపబడ్డారు" అని స్పష్టీకరించారు ఫ్రెంచిప్రకటన పత్రంలో "హక్కులవిషయంలో మానవులందరూ స్వతంత్రులుగానూ, సమానులుగానూ జన్మించారు అలాగే నిరంతరం జీవిస్తారు. కనుక పౌరులలో ఉండే తేడాలన్నీ కేవలం సాంఘికసౌకర్యాలకోసం ఏర్పాటుచేసుకొన్నవిగానే ఉండాలి" అని చెప్పబడింది. అందువలన ఈ స్వాతంత్ర్యాల సంపూర్ణప్రాముఖ్యతను గురించి, వాటివిషయమై ప్రధానంగాచెప్పవలసిన ఆవశ్యకతను గురించీ తెలుసుకోవాలంటే విశేషభిన్నత్వములతో కూడిన పద్ధతివలనా, వెనుకచెప్పిన ప్రత్యేకసౌకర్యాలవలనా కలిగిన

అనర్థాలను తెలుసుకొంటే చాలు. ఈ రోజులలోకూడా సామ్య సిద్ధాంతాన్ని ఖండించేవారు ఉన్నారు అందువలన దానిని బలపరిచేవారు అసలు దానికిచెప్పే వ్యాఖ్యానాన్ని తెలుసుకొనడం అవసరం, ఈ సందర్భంలో 'లోకే' మనకు ఆధారం చూపించాడు — "నేను మానవులందరూ సమానులే అని పైన చెప్పినప్పటికీ, అన్నివిధాలైన 'సమానత్వాలనూ' నేను ఉద్దేశించినటు ఊహించరాదు. వయస్సువలనా, మంచితనము వలనా కొందరు వ్యక్తులకు న్యాయమైన ఆధిక్యత లభింపవచ్చు. అసాధారణ ప్రజ్ఞలవలనా యోగ్యతలవలనా మరికొందరు సాధారణ స్థాయిలోని వారందరికంటే ఉన్నతులుగా ఉండవచ్చును. జన్మతః కొందరికీ, సంపర్గమువలన మరికొందరికీ ఇంకా కొందరికి స్వాభావసిద్ధంగానూ, కృతజ్ఞతవలనా, ఇతర గౌరవాలవలనా కూడా ఉన్నతి కలుగవచ్చును. అయినను ఇవి అన్నీ మానవులందరకూ చెందే పరస్పర సంబంధముల హద్దులూ, ఆనలతోకూడిన సమానత్వములో ఇమిడిపోయే ఉంటాయి మన ప్రస్తుతావసరానికి తరుశోపాయంగా పైన నేను ప్రతిపాదించిన సమానత్వం ఇదే. అనగా ప్రతిమానవుడూ ఇతరుల అగ్రహానుగ్రహాలతో నిమిత్తంలేకుండా సహజసిద్ధమైన స్వేచ్ఛను అనుభవించడానికి ఇతరులందరితో సమానంగా హక్కు కలిగి ఉంటాడు. స్పష్టంగా చెప్పాలంటే దీనిఅర్థం— కేవలం తమ జన్మవలనా, జాతివలనా చక్రవర్తులకూ జమీందారులకూ దేశమండలి ఇతర వర్గముల ప్రజలపైన అధికారం చెలాయించే హక్కు లేదు—అని. కొందరు మానవులు దేవతలుగా తక్కినవారందరూ నీచులుగా అనే భాగాలుగానే

ప్రత్యేక సౌకర్యాలూ, మర్యాదలూ ఆధారపడిఉన్నాయి. ఈభావాన్నే సమానత్వసిద్ధాంతవాదులు ప్రతిఘటించారు. సమానత్వమంటే – పనీ పాటాలేని జమీందారుల స్వప్రయోజనాలకోసం వెట్టిరైతు ఉపయోగింపబడినట్టు ఒక మానవుడు మరొకమానవుని సౌఖ్యముకొరకు ఉపకరణమాత్రుడుగా వినియోగింపబడరాదనీ,... అత్యంత ఉన్నత తరగతికి చెందిన గౌరవస్థులతో సమానంగా అతినిమ్నతరగతి మానవుని విషయంలోకూడా ప్రభుత్వం శ్రద్ధతీసికొనవలసిన అర్హత అతనికి ఉన్నదనీ, ఐశ్వర్యమూ సౌఖ్యమూ అధికారమూ పలుకుబడీ మొదలైన జీవితమునందలి ఉత్తమ విషయాలన్నీ అల్పసంఖ్యాకులయిన జమీందారులకూ మతాధిపతులకూ మాత్రమే గుత్తకీయబడి ఉండరాదనీ కూడా ను. మానవుని సౌఖ్యం చాలావరకు సాంఘిక వాతావరణముమీద ఆధారపడి ఉంటుంది అనీ, తక్కువజాతులవారికి ఉత్తమ తరగతులవారికి లభించే సుముఖమైన సాంఘికవాతావరణం లభించదు అనీ విప్లవవాదుల విశ్వాసం. సమానత్వమును గురించి వారు అంత పట్టుదల పట్టడంలో వారిఆశయం, ఈ ప్రత్యేక మర్యాదలు లేని నిమ్నతరగతులవారికి కూడా సౌఖ్యావహమయిన వాతావరణం లభించేలా చేయడమే ఈ సమానత్వముకూడా ఒక హక్కుగా ఉండదగినది అని అంగీకరించడం వలన వెట్టిచాకిరి పద్ధతి ఎత్తివేయబడింది, పన్నులభారం శక్తిసామర్థ్యాలలోని హెచ్చుతగ్గులను అనుసరించి పంచబడింది. మొఖాసాభూములు కృషి చేసేరైతుకు పంచిపెట్టబడ్డాయి, పరిశ్రమలపైన అంతకు పూర్వం పురాధికారసంఘాల (Guild) చే విధింపబడిన నిర్బం

ధాలు తొలగింపబడ్డాయి. ప్రభుత్వపు కచేరీలన్నింటిలోకీ అన్ని తరగతులవారికీ ప్రవేశం లభించింది. సమానత్వపు హక్కులో ఇమిడిఉన్న సత్యానికీ అది సాధించిన ఇట్టి విజయాలనుబట్టే విలువకట్టాలి.

ఇప్పుడు చర్చించిన ఈ ప్రాథమికస్వత్వాలపట్టిక సమగ్రమైనదికాదు ఫ్రెంచి ప్రకటన పత్రంలోని కెక్కిన వాటిని మాత్రమే ఇక్కడ ఉదాహరించాం. ఇంకా ఇతరదేశాల రాజ్యాంగశాసనాలలో స్థానము సంపాదించుకొన్న ఇతర హక్కులు చాలాఉన్నాయి ఉదాహరణకు. అమెరికా సంయుక్త రాష్ట్రముల రాజ్యాంగవిధానంలో శాంతియుతంగా సమావేశం కావడానికి, అక్రమమైన సోదాలూ, ముట్టడులూ జరుగకుండా చేయటానికీ, పంచాయితీదార్లచే విచారణ చేయబడటానికీ వేరు వేరు హక్కులూ, ఇంకా ఇలాంటి ఇతర హక్కులూ చేర్చబడ్డాయి. ఇలాంటిమార్పులే, చాలావరకూ చిన్నచిన్నవి 19 వ శతాబ్దపు రాజ్యాంగ శాసనాలలో కూడా కనిపిస్తాయి. అవి-ఇతరత్రా విశదీకరింపబడిన హక్కులను ఇంకా సూక్ష్మంగా వివరించడానికి కొన్ని ఆయా దేశాలలో ప్రబలియుండిన ప్రత్యేక పరిస్థితులనుబట్టీ, ప్రభుత్వాలవలన వారికి జరుగుతూన్న ప్రత్యేక అన్యాయాల ననుసరించి ఏర్పడినవి. వీటివలన ఈ సిద్ధాంతాంతరార్థ మేమీూ మారదు. 20 వ శతాబ్దంలో తయారుచేయబడిన రాజ్యాంగశాసనాలలో మాత్రం మనకు ఎక్కువ ప్రాముఖ్యముగల మార్పులు కనిపిస్తాయి. ఇవి వేరొకచోట వివరింపబడినాయి.

# చతుర్థాధ్యాయము

## పరిమిత ప్రభుత్వసిద్ధాంతం

నిరంకుశయుగంలో తయారుచేయబడిన ప్రాథమిక స్వత్వసిద్ధాంతముయొక్క ప్రధానలక్షణం ప్రభుత్వచర్యలకు అది తీవ్రముసైన పరిమితులను నియమించడం. ఈ సిద్ధాంతం మొత్తంమీద మానవజీవితమును వ్యక్తిగతము, సాంఘికము అనే రెండుశాఖలుగా విభజించింది. మొదటిది అతని ప్రాథమిక స్వత్వములశాఖ, ఈ భాగంలో అతను ప్రభుత్వాజోక్యం ఏమీలేకుండా తనకు తానుగా, స్వతంత్రుడుగా ఉంటాడు. దీనివలన అతడు పూర్తిగా ఏకాంతంగా ఉంటాడు అనుకోకూడదు. అతడు ఇతరులతో ఈ సందర్భంలో పెట్టుకొనే సంబంధబాంధవ్యాలన్నీ కేవలం తన స్వేచ్ఛానుసారం పెట్టుకొనేవిగా ఉంటాయని మాత్రమే దానిభావం. ఇంతవరకూ నిరంకుశచక్రవర్తులందరూ చెలాయిస్తూఉంటినట్లు ఇకపైన ప్రభుత్వానికి ఈ భాగంలో అడుగు పెట్టడానికి హక్కు లేదు. ప్రభుత్వాధికారం మానవుని సాంఘికజీవితంలో అతని ప్రవర్తనను శాసించడమువరకూ మాత్రమే పరిమితమై ఉంటుంది.

దీనివలన ఈ సిద్ధాంతానికీ 17, 18 శతాబ్దాలలో పండితులచే వివిధదృక్పథాలనుండి పరిశీలింపబడి సక్రమంగా తయారుచేయబడిన పరిమిత ప్రభుత్వ సిద్ధాంతానికీ సన్నిహిత సంబంధం ఉన్నట్లు తేలుతూంది. ఈ సిద్ధాంతాన్ని అనుసరించి ఏ ప్రభుత్వమూ తనప్రజలమీద అపరిమితాధికారాలను చెలాయించకూడదు. నియమరహితమైన అధికారం ప్రజలను నిర్బంధాలపాలు చేయడమేగాక క్రమంగా ఆ అధికారమును

కలిగిఉన్నవారి వినాశానికికూడా కారణంఅవుతుంది. వారు ఎల్లప్పుడూ సౌశీల్యమునుగూర్చిన తమఅభిప్రాయాలను ఇతరులపైన రుద్దడానికి యత్నించడమూ, చివరకు తాము శాశ్వతంగా అధిపతులుగా ఉండటమే దేశానికి క్షేమకరమన్నట్లు వ్యవహరించడమూ జరుగుతుంది. 'లాకే' పండితుడు చెప్పినట్లు నిరంకుశచక్రవర్తులూ ప్రభువులూ కూడా మానవులే, వారూ తక్కినవారివలెనే సృష్టింపబడ్డారు, మానవ దౌర్బల్యాలన్నీ వారికీఉంటాయి "అధికారం మానవునిరక్తాన్ని పరిశుద్ధపరచి పవిత్రంచేస్తుంది అనీ, మానవప్రకృతిలోని నైచ్యమును కడిగివేస్తుంది అనీ భావించేవారు ఎవరైనా ఉంటే వారు ఈ యుగపుచరిత్రనుగాని, మరి ఏయుగపుచరిత్రనైనాగాని చదివితే అది శుద్ధ అసంబద్ధమైన భావమని బోధపడుతుంది. అమెరికా ఖండపు అరణ్యాలలోఉంటే భయంకరుడూ, ప్రమాదకరుడూ అయే మానవుడు సింహాసనముమీద ఎక్కి కూరుచున్నంతమాత్రాన మారిపోవడం కల్ల. అయితే ప్రజలయెడ ఆతని ప్రవర్తనను సమర్థించడానికి అవసరమైన ధర్మశాస్త్రాలూ, మతగ్రంథాలూ ఇక్కడ ఉన్నాయి. వాటిని ఉల్లంఘించి వ్యతిరేకంగా ప్రవర్తించిన వారిని దండించడానికి అస్త్రశస్త్రాలు కూడా ఉన్నాయి." 'ప్రభుత్వాలు అనగా కొందరు సామాన్య మానవుల కూటములే' అన్న విషయాన్ని జ్ఞాపకం ఉంచుకొనడం చాలాఅవసరం. ఎందుకంటే అధికారమంతా ప్రభువుల హస్తగతమయే ఉండాలని వాదించే "హాబిస్" మొదలైనవారు... ...ప్రజలందరినీ ఉత్తమ అధమ తరగతులు అనే రెండు విభాగాలుగా చేయాలనీ, మొదటి తరగతివారే ఎల్ల

ష్వగూ పాలకులుగా ఉండాలనీ అధమ తరగతివారంతా పాలితులుగానే ఉండాలనీ. . కోరుతున్నారు. బానిస అనగా నీచకులములో పుట్టినవాడు అనీ, వాడు తననుతాను పరిపాలించుకోన డానికి జన్మచేతనే అసమర్థుడు అనీ అరిస్టాటిల్ చేసిన సిద్ధాంతానికి ఇది పునరుక్త. పాలకులుకూడా మానవులే అనే సత్యాన్ని అంగీకరించడం వలన అపరిమితాధికారాలను చెలాయింపదగిన మానవుడెవరూ లేనట్లు స్పష్టంగా తేలుతూంది మానవోత్తముని ఏకచ్ఛత్రాధిపత్యముకంటెకూడా శాసన బద్ధమైన ప్రభుత్వ పద్ధతే చాలా ఉత్తమమైనది.

ఈ పరిమిత ప్రభుత్వ సిద్ధాంతవాదులు ఆ సిద్ధాంతాన్ని సమర్థిస్తూ ప్రభుత్వాధికారానికి విస్పష్టమైన కొన్ని హద్దులను నిర్ణయించడానికి ఉపయోగపడే ఒక సూత్రాన్నికూడా తయారుచేయడానికి యత్నించారు. ఈ సూత్రానికి ప్రకృతి సిద్ధ సూత్రము అనీ హేతువాద సూత్రమనీ, ప్రజాకళ్యాణ సూత్రమనీ, ప్రాథమిక స్వత్వ సూత్రమనీ చాలా పేర్లు పెట్టారు పై నామకరణాలన్నీ వారికి కొంచెం ఇంచుమించు సమానార్థకాలుగానే తోచాయి. ఈ ప్రకృతి సిద్ధసూత్రము రాజుల సిద్ధాంతాలకంటె గట్టిదిఅనీ, ఉన్నతమైనదని, మానవులందరికీ "శాసన కర్తలకూ శాసితులకూకూడా శాశ్వతంగా వర్తించే సూత్రమనీ వారివాదం. భగవత్సంకల్పానికి ప్రకటన ప్రాయమైన యీప్రకృతిసిద్ధసూత్రానికీ లోబడేప్రభువులు ప్రజలచర్యలను శాసిస్తూ చేసే ఆజ్ఞలూ వారియొక్క, ప్రజలయొక్క ప్రవర్తనా నియమింపబడాలి" ఏనిలోనుంచే వారు ఈ నియమాన్ని ఉల్లంఘించి చేసే అధికారచర్యలేవీ చెల్లదగినవిగాని

క్రమమైనవిగాని కావు అనే సారాంశమునుకూడా తీశారు. సర్వజనీనమైన ప్రజాకళ్యాణసూత్రంఅన్నా, అది ఈ అంశాన్నే వ్యక్తంచేస్తుంది. ప్రభుత్వాలు ప్రజాకళ్యాణ కారకములై ఉండవలెనేగాని అధికారం చెలాయించే కొద్దిమందియొక్క వ్యక్తిగత క్షేమ లాభాలను అభివృద్ధి చేసేవిగా ఉండకూడదు. కనుకనే ఈ పని నెరవేర్చడానికి అవసరమైన పరిమితాధికారం మాత్రమే ప్రభుత్వాలకు ఇచ్చారు. ప్రభుత్వము ఇలా ప్రజా కళ్యాణమును సాధించడానికి ఉపయోగపడే పనులనుమించి ఏపనీ చేయకూడదు అనికూడా స్పష్టంచేశారు. ఎందుకంటే "ఒక సంఘానికి దాని ఆశయసూర్తికి అవసరములుకాని పను లన్నీ అనవసరములే" కనుక.

ప్రభుత్వాధికారం ఈ ప్రకృతి సిద్ధసూత్రముచేత లేక ప్రజాకళ్యాణ సూత్రముచేత పరిమితం చేయబడినది అనే భావా నికీ, కాదు, మానవుని ప్రాథమిక స్వత్వములచేతనే అది పరి మితం చేయబడినది అనే భావానికీ వైరుధ్యంలేదు. దీనికి కారణం ఈ స్వత్వాలుకూడా ఆ ప్రకృతిసిద్ధ సూత్రజన్యములే అవటమూ, వాటి ప్రయోజనమూ ప్రజాకళ్యాణమే అవటమూ. ఆస్తినీ, స్వాతంత్ర్యమునూ, సమానత్వమునూ అనుభవించ డానికి మానవునికిగల హక్కు విప్లవకారులైన ఎవరో కొందరు బుద్ధిమంతులు నిరంకుశంగా తయారుచేసిన ఛాందసపు సిద్ధాంతం కాదు. వారి అభిప్రాయంలో ఈ హక్కులు వ్యక్తి శ్రేయ స్సుతోపాటు మొత్తం సమిష్టిమీద సంఘముయొక్క శ్రేయ స్సునకుకూడా కారణభూతాలు. వ్యక్తులు ఈ హక్కులను అనుభవించడం మొత్తం సమాజమంతటికీ ప్రయోజనకారి.

ఈ సందర్భంలో చెప్పదగినది మరొక విషయంకూడాఉంది. విప్లవకారులైన పండితులలో చాలామంది, సంఘము చైతన్యవంతమయినది అనే దృష్టిలో కాక కేవలం యంత్రంవంటిది అనే దృష్టితో చూచారు సంఘమంటే దానియందలి వ్యక్తులయొక్క సమూహమే గాని దానికి ఆ వ్యక్తులకంటే భిన్నమైన అస్తిక్యము లేదని వారు అభిప్రాయపడ్డారు. వ రి ఉద్దేశంలో సంఘ శ్రేయమంటే సంఘములోని వ్యక్తుల శ్రేయముయొక్క మొత్తం. ఇట్టి తార్కికదృష్టితో వారు ఈ ప్రకృతిసిద్ధసిద్ధాంతమూ, సర్వప్రజా కల్యాణ సిద్ధాంతమూ, ప్రాధమిక స్వత్వములను గూర్చిన అభిప్రాయమూ, ఇవన్నీ ఒకే ప్రధాన సత్యముయొక్క, అనగా ప్రభుత్వాధికారం పరిమితంగానే ఉండాలి, అనే ప్రధాన సత్యముయొక్క వివిధరూపాంతరాలు అని అభిప్రాయపడ్డారు. దీనిలో ఆశ్చర్యపడవలసినదేమీ లేదు.

ప్రాధమిక స్వత్వ సిద్ధాంతము అనే వ్యక్తస్వరూపమును గలిగిన ఈ పరిమిత ప్రభుత్వాధికార సిద్ధాంతము ఆధునిక రాజ్యాంగ పరిణామంలో చాలా ముఖ్యమైనది. అప్పుడప్పుడు జరిగే ఎన్నికలద్వారా తమ ప్రభుత్వాలను నిర్మించుకొనడానికీ నిర్మూలం చేయడానికీ వాటిని తమకే బాధ్యత వహించేట్టు చేయడానికీ ప్రజలకుగలహక్కుగా అది ప్రజాస్వామిక పద్ధతికి మూలకందమై నియంతృత్వ, నిరంకుశ రాజ్యాంగపద్ధతులనుండి దానిని వేరుపరుస్తుంది. సర్వాధికార ప్రభుత్వ సిద్ధాంత వాదుల వలె ప్రభుత్వమంటే సంఘమే అనే విషయాన్ని అది అంగీకరించదు: ఒకజాతి ప్రజలలో, వారిలో వారికి, రాజకీయాలతో ఏమీ సంబంధంలేని అనేకవిధములైన సంబంధబాంధవ్యాలు

ఉండవచ్చును. అనీ, వాటినన్నిటినీ పౌరులు వ్యక్తిగతంగాగాని ఐచ్ఛిక సంఘాలద్వారాగాని యథేచ్ఛగా ఏర్పాటు చేసుకొన్న నియమాలనీ అంగీకరించింది. కొందరు ఆధునిక రచయితలు, తమ పూర్వులు ప్రాథమిక స్వాతంత్ర్యావకాశము అన్న మానవ వ్యక్తిగతావరణకు 'విజ్ఞానము' (Culture) అనే నూతన నామకరణం చేశారు శాస్త్రపరిభాష ఏది అనేది అంత ప్రధానమైనది కాదు. ముఖ్యంగా గ్రహించవలసిన విషయం ఈ ప్రాథమిక స్వాతంత్ర్య సిద్ధాంతము స్వరూపతః కొంత పురాతనమైనదిగా కనిపించినా, ప్రజాస్వామిక సిద్ధాంత సూత్రములనే నిర్వచిస్తుందనీ, ప్రజాస్వామిక ప్రభుత్వసిద్ధాంతమువలెనే పూర్వ చక్రవర్తుల నిరంకుశ ప్రభుత్వపద్ధతికి అధునాతన రూపమైన సర్వాధికార ప్రభుత్వపద్ధతి (Totalitarianism) ని ప్రతిఘటిస్తుందనీ ప్రొఫెసర్ మాక్లెయిన్ చెప్పినట్లు హక్కుల చట్టముచే నియమితమైన పరిమితప్రభుత్వానికీ అధికారవిభజనతోనూ నియమనిరోధాలతోనూ బలహీనమైన ప్రభుత్వానికీ ముఖ్యమైన విభేదము ఉన్నది అన్నవిషయంకూడా ఈ సందర్భములో తెలుసుకొనదగినది. ఇందులో మొదటిది అవసరమూ, అపేక్షణీయమూ, రెండవది ప్రమాదకరము.

## పంచమాధ్యాయము

# ప్రజాస్వామిక పద్ధతిలో - - - - ప్రాథమిక స్వత్వాలు

ఈ ప్రాథమిక స్వత్వసిద్ధాంతం ఆదిలో చక్రవర్తుల నిరంకుశవిధానమును నిర్మూలించడానికి తయారు చేయబడిన అస్త్రం, కాని క్రమంగా అది కొలదికాలంలోనే మొత్తము ప్రభుత్వ నియంతృత్వానికే గొడ్డలిపెట్టుగా తయారయింది. ఈ సిద్ధాంతానికి అనుకూలురు తా మనుసరించిన హేతువాదంతో ఈ సిద్ధాంతముయొక్క లక్ష్యమూ అదే అని తేల్చుకున్నారు. వారి అభిప్రాయంలో చక్రవర్తులయొక్క ప్రభుత్వాలుగాని, ప్రాతినిధ్య పద్ధతితో ఏర్పాటుచేయబడిన ప్రభుత్వాలుగాని, ప్రజలచేతనే నియమింపబడి ఆ జాతియొక్క లేక దేశముయొక్క ప్రతినిధులుగానూ, ఏజెంట్లుగానూ పనిచేయాలి. వారికి ప్రజలు ఇచ్చిన అధికారాలను మాత్రమే వారిక చెలాయించాలి, ఏ దేశములోని ప్రజలూ తమ ఏజెంట్లకు అపరిమితాధికారాలను ఇవ్వరు; అలా ఇవ్వడము అక్రమము. "లాకే" పండితుడు చెప్పినట్లు "శాసన నిర్మాణాధికారం ఒకేసభకు ఈయబడినా లేక కొన్ని సభలకు ఈయబడినా అది చిరకాలం ఉండేది అయినా అప్పుడప్పుడు లభిస్తూఉండేది అయినా ప్రజాస్వామిక పద్ధతిలో అదే అత్యున్నతాధికారం అయినా ప్రజలయొక్క ప్రాణ విత్తములపైన నిరంకుశమైన సర్వాధికార

మును చెలాయించడానికి దానికి హక్కు లేదు. ఉండడానికి అవకాశం లేదు.'' రూసోకూడా సరిగా ఈలాగే అభిప్రాయపడి ప్రభుత్వానికి తన యిష్టానుసారం ఏశాసనమునైనా చేయడానికి అధికారం ఇచ్చినట్లయితే ఆ ప్రభుత్వం ఆ ప్రజలచే ఎన్నుకొనబడినదే అయినా ఆప్రజలు స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తారని చెప్పడానికి వీలు లేదు అన్నాడు, ''ఇంగ్లాండు దేశపు ప్రజ తాను స్వతంత్రమైనది అని సంతోషిస్తూంది. కాని అది చాలా పొరపడుతూంది పార్లమెంటు మెంబర్లను ఎన్నుకొనేటప్పుడు మాత్రమే దానికి స్వాతంత్ర్యం ఉంది, ఆ ఎన్నిక అయిపోగానే వారికి బానిసత్వం ప్రాప్తిస్తూంది, తరువాత ఆ ప్రజకు ఆ స్తిత్వమే లేదు.'' అని రూసో అతని విలక్షణమైన ధోరణిలో వెల్లడించాడు. బ్రిటిష్ పార్లమెంటుయొక్క సర్వతంత్ర స్వతంత్రతే ఆయన ఇలా నిర్ణయించడానికి కారణం. ఇలాంటి భావాన్నే థామస్ పెయిన్ కూడా వెలిబుచ్చాడు ఆయన అభిప్రాయానుసారం, ప్రభుత్వాధికారులలో కొందరు ఎన్నుకొనబడినవారు అయినంత మాత్రాన, అలా ఎన్నుకొనబడినవారు ఒక పార్లమెంటుగా ఏర్పడి అపరిమితాధికారాలను చెలాయిస్తూఉంటే అది నిరంకుశ ప్రభుత్వం కాకుండాపోదు. అలాంటప్పుడు ఎన్నికకూ, ప్రాతినిధ్యానికీ భిన్నత్వం ఏర్పడుతూంది, ఆ అభ్యర్థులు నిరంకుశాధికారాలను అభ్యర్థిస్తున్నారన్నమాట.

ప్రాథమికస్వత్వ సిద్ధాంతం ఇలా, ప్రజాస్వామిక పద్ధతులలో ఎన్నుకొనబడిన సంస్థల అధికారాలను కూడా తగ్గించవలసిన అవసరం ఉన్నదని అభిప్రాయపడడానికి కారణం కేవలం సిద్ధాంతానికి సంబంధించినదే కాదు. చారిత్రకానుభవాల

వలన ఇలాటి సంస్థలు నిరంకుశ చక్రవర్తులలాగే, అంత దౌర్జన్యంగానూ, దుర్మార్గంగానూ, అధికార మత్తములుగానూ తయారయే అవకాశం ఉన్నదని వారు గ్రహించారు రూసోకి తన జీవితకాలంలో ప్రజాప్రతినిధి ప్రభుత్వవిధానమును అమలు పరచుకొన్న ఏకైకదేశమైన ఇంగ్లండునందలి పార్లమెంటే దురుద్యోగ పూరితమైన నిరంకుశసంస్థయై, ఆ ప్రభుత్వపద్ధతినే హాస్యాస్పదం చేస్తూన్నట్లు కనిపించింది, పైగా అమెరికావారి మీద పన్నులను విధించి వారి వర్తకమును నియమానుసారం నడపడానికి తనకు లేనిపోని అధికారాన్ని తెచ్చిపెట్టుకొని అమెరికను విప్లవానికి కారణమైనదికూడా ఈ పార్లమెంటే గాని మూడవ జార్జి కాదు. ఇంతకంటె ముఖ్యమైన నిదర్శనం మరొకటి ఉంది: అమెరికనులు తమ స్వాతంత్ర్య ప్రకటనానంతరం స్వయంగా స్థాపించుకొన్న ప్రజాప్రతినిధి శాసనసభల వలన వారికి కలిగిన అనుభవం. ఈ శాసనసభలలో అనేకం ప్రజల స్వాతంత్ర్యానికి భంగకరంగా అనేక అధికారాలు చెలాయించినాయి, వారు వ్యక్తుల ఆస్తులను వారికి ఏవిధమైన ప్రతిఫలమూ ముట్టచెప్పకుండా న్యాయశాస్త్రవిధుల ననుసరించి ఎలాంటిచర్యలూ జరుపకుండా అపహరించారు, ప్రజల వద్ద తీసుకొన్న ఋణాలను ఎగకొట్టారు, విలువలేని కాగితపు పైకమును అమలులో పెట్టారు, ముద్రణాప్రకటనా స్వాతంత్ర్యాలను అరికట్టారు, పంచాయితీదార్లచే విచారణచేయించే పద్ధతిని రద్దుచేశారు. విద్రోహక నిస్సత్వశాసనాన్ని (Bill of attainder) — అనగా విచారణలేకుండానే ప్రవాస శిక్షలుగాని మరణదండనల్నుగాని విధించడానికి అనుకూలపడే శాసనమును

తయారుచేశారు. ఇల్లా వారు ఈ బహుజనైచ్ఛిక ప్రభుత్వపద్ధతి లోనే నానా అక్రమాలూ చేశారు. అందువలన ప్రజలు ఎన్నుకొన్న ఈ శాసనసభలుకూడా నిరంకుశ విధానాల నవ లంబించి వ్యక్తి స్వాతంత్ర్యాలలో జోక్యం కలిగించుకొన వచ్చుననే భయం సహజంగా ప్రజలకు ఏర్పడింది. ఈ ప్రభు త్వాధికారాలకు హద్దుల నేర్పాటుచేయడానికి గాను ఈ ప్రాధ మిక స్వత్వాలను ప్రకటించడము — వంశానుగతమైన హక్కు గల చక్రవర్తుల పరిపాలనగల దేశాలలో ఎంత అవసరమో, ప్రజాస్వామిక ప్రభుత్వాలను గలిగిన దేశాలలోకూడా అంత గానూ అవసరమే అన్నసంగతిని వారు గ్రహించారు. చక్ర వర్తుల బాధ తీరిపోయి ప్రజాస్వామిక ప్రభుత్వాలు ఏర్పడిన దేశాల రాజ్యాంగ శాసనాలలో కూడా ప్రాధమిక స్వత్వముల జాబితాను చేర్చడము పరిపాటి అయిపోవడానికి అదే హేతువు. ప్రజలచే నిర్మింపబడిన ప్రభుత్వాలకుకూడా అధికారం నియ మితమై ఉండాలి అని అమెరికాకు రాజ్యాంగవిధానమును తయారుచేసినవారు మొదట స్పష్టీకరించిన సత్యాన్ని తరువాత ఇతర ప్రజాప్రతినిధి సంస్థలలో కలిగిన అనుభవాలుకూడా స్థిరపరిచాయి.

ఇందువలననే కేవలం ప్రజలంతా కలిసి ఎన్నుకొనిన వారికి అధికారం లభించగానే ఆ ప్రభుత్వపద్ధతిని ప్రజాస్వామిక పద్ధతి అనడం యుక్తంకాదు. వెనుకటి అధ్యాయంలో చెప్పి నట్లు కొన్ని శాఖలలో మానవునికి స్వేచ్ఛగా జీవించే అధి కారం ఉన్నదని అంగీకరించే ఉదారస్వభావం ప్రభుత్వానికి ఉండాలి ఇది ప్రజాస్వామికప్రభుత్వానికి మూలకందము

ప్రాథమిక స్వత్వవివరణ చక్రవర్తుల ప్రభుత్వాలలో ఎంత అవసరమో వీటిలోనూ అంతగానూ అవసరమే

ప్రజాస్వామిక ప్రభుత్వ పద్ధతిలో వ్యక్తిస్వాతంత్ర్య రక్షణకుగల ప్రాధాన్యతను గురించి జాన్‌స్టూఅర్ట్‌మిల్‌వలె తీవ్రముగా వాదించినవాడు ఆధునిక రచయితలలో మరొకడు లేడు, అయితే అతడు ప్రాథమికస్వత్వసంబంధమైన పరిభాషను వాడకపోయి ఉండవచ్చును. ప్రజాభిప్రాయమూ, అంటే తటస్థ బుద్ధులైన సామాన్యుల అభిప్రాయమూ – బహుసంఖ్యాకుల ఒత్తిడీ చక్రవర్తుల రాజరికాని కంటెనూ, ఐశ్వర్యవంతుల ప్రభుత్వానికంటెనూ ఎక్కువగా —— మానవవ్యక్తిని అణచి వేయవచ్చునని ఆయన భయపడ్డాడు. ఈ బహుసంఖ్యాక నిరంకుశత్వముల బారినుంచి వ్యక్తిని రక్షించడంకోసం ఆయన ఆచరణయోగ్యములైన అనేక ఉత్తమ ఉపాయాలను సూచించాడు. వీటిలో నిష్పత్తి ననుసరించి ప్రాతినిధ్యం అనే రక్షణ లాంటివి యుద్ధానంతరం చాలా ప్రజాస్వామిక రాజ్యాల్లో అమలు పరచబడ్డాయి.

మిల్లు చెప్పినట్లు ప్రజాస్వామికరాజ్యాల్లో వ్యక్తి స్వాతంత్ర్యాన్నిగూర్చిన ప్రాథమిక స్వత్వానికి తటస్థించిన ఆపదలలో ఒకటి–ప్రస్తుతం వివిధజాతులతో కూడిఉండి అందులో ఒక బహుసంఖ్యాక జాతిమాత్రమే అధిక ప్రాముఖ్యమును గలిగిఉన్న దేశాల్లో చాలా ముఖ్యసమస్యగా పరిణమించింది. ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం యూరపు ఖండంలో శాంతిస్థాపనకు బాధ్యులైన రాజకీయవేత్తలకు ఇది ప్రపంచశాంతికే చాలా భంగకరమైనదని తోచింది,

క్రొత్తగా ఏర్పాటు చేయబడిన పోలెండు, జెకోస్లోవేకియా మొదలైన చాలారాజ్యాల్లో వారు అల్పసంఖ్యాకవర్గాలకు ప్రత్యేకపుహక్కులను ప్రసాదించి నానారాజ్యసమితిని వాటికి రక్షణకర్తగా ఏర్పరిచారు ఆచార్య లాస్కీ చెప్పినట్లు, "ప్రజాస్వామిక రాజ్యాలలోకూడా అల్పసంఖ్యాకులను వారి స్వాతంత్ర్యమును అపహరింపజూచే బహుసంఖ్యాకుల బారినుండి మనము తప్పించవలసి ఉన్నది. ఒకమారు ప్రజానీకానికి స్వదేశాధిపత్యం లభించగానే ఇక అంతులేని అధికారం చెలాయించవచ్చు ననే అపోహవలన మానవజాతి చాలా నష్టపడింది. కేవలం ప్రజాస్వామిక పద్ధతే స్వాతంత్ర్యానికి హామీ కాదు అని తెలుసుకోనడానికి మనం నీగ్రోలు మొదలైన జాత్యల్పసంఖ్యాకులయొక్క మత రాష్ట్రీ అల్పసంఖ్యాకులైన యూదులూ, జెక్కులూ మొదలైన వారియొక్క చరిత్రలను జ్ఞాపకం ఉంచుకోవాలి." ఈ సమస్యే ప్రస్తుతం భారతదేశంలో చాలా ప్రాధాన్యము వహిస్తూంది. మహమ్మదీయులూ, నిమ్న జాతులూ మొదలైన అల్పసంఖ్యాకవర్గాలవారు భవిష్యత్తులో ఏర్పడబోయే, ప్రజాస్వామిక పద్ధతిని పరిపాలింపబడే స్వతంత్ర భారతవర్షంలో తమ స్థానాన్నిగురించి భయపడుతూ ఉండటమే దీనికి కారణం.

# షష్ఠాధ్యాయము

# సిద్ధాంత చరిత్ర

ఈ ప్రాథమిక స్వత్వసిద్ధాంత చరిత్రలో ఇంతవరకు రెండుదశలుగడిచాయి. మొదటిది, 18, 19 శతాబ్దాలనాటి దశ. రెండవది 20-వ శతాబ్దపు దశ. దాని ప్రథమ దశా స్వరూపానికీ రెండవదశలో దాని స్వరూపానికీ మధ్య చాలా మార్పులు జరిగాయి. మొదటి మార్పు దాని అంతర్యం చాలా విశాలం చేయబడింది. మొదట దానిలో చేర్చబడని అనేక వాక్యాలు క్రమంగా దానిలో చేర్చబడ్డాయి. అలాగే ప్రాథమికావస్థలో దానిలో చేర్చబడిన వాక్యాలు కొన్ని తరువాత మార్పుచేయబడ్డాయి, మరికొన్ని అప్రధానములుగా పరిగణింప బడ్డాయి. రెండవమార్పు,- ఈ సిద్ధాంతం ప్రథమదశలో ప్రభుత్వం చేయవలసిన పని ప్రతిక్రియాత్మకముగా మాత్రమే ఉండాలి. అనగా 'తటస్థపద్ధతి' (Laissez faire) అన్నదానిని అమలుపరచడం మాత్రమే—అని నిర్వచిస్తే, రెండవదశలో అది ప్రభుత్వమే పూనుకొని నిర్మాణాత్మకంగా పనిచేయాలని నిర్ణయించింది. మూడవమార్పు ఈ స్వత్వసిద్ధాంతానికి రెండవ దశలో విధుల సిద్ధాంతము అనే దాన్నికూడా జత చేశారు; అసలు తొలిసిద్ధాంతానికి వ్యతిరేకులు కొందరు లేవదీసిన విమర్శలకు సమాధానంగా ఈపనిచేశారు. ఈ మార్పులన్నీ సంగ్రహంగానైనా పరిశీలించదగినవి.

ఈ సిద్ధాంతంలో చేయబడిన ఈమార్పులన్నీ 19-వ

శతాబ్దంలో పాశ్చాత్యదేశాలలో చెలరేగిన పారిశ్రామిక విప్లవ ఫలితాలు. ఈ విప్లవఫలితంగా కార్మికవర్గమొకటి వెలిసింది ఈవర్గం నిరుద్యోగం అనే దీర్ఘరోగానికీ, దినమునకు ఇన్ని గంటలు అని పరిమితిలేని కూలిపనికీ, తక్కువ కూలికీ, ఆధునిక నగరజీవితానికి లక్షణాలయిన అనారోగ్యపరిస్థితులకీ గురిఅయి బాధపడవలసి వచ్చింది శాస్త్రజ్ఞానం అభివృద్ధిఅయి క్రొత్తయంత్రాలు తయారయి ఐశ్వర్యాన్నీ వస్తూత్పత్తినీ అమితంగా వృద్ధిచేస్తూఉన్నా, కార్మికవర్గముయొక్క సౌకర్యాలలోనూ, సౌఖ్యంలోనూ, తగినంత మార్పు ఏమీ కలుగలేదు. వారిలో విద్యాజ్ఞానం తక్కినవారిలోకంటె చాలా తక్కువ. ఈ స్వత్వాలు, మానవులందరూ సుఖంగా జీవించడానికీ, సాధ్యమయినంతలో వారు ఉచ్చస్థితిని పొందడానికీ ఉద్దేశించి కల్పింపబడినవే అయినా పారిశ్రామిక విప్లవంవలన సంభవించిన ఇక్కట్లలో అవి శ్రామికవర్గానికి ప్రతిరోధకాలు అయాయి. ఈ పరిణామమే సామ్యవాదభావన రేకెత్తడానికి కారణమయింది. యువజను లందరకూ నియోజనాధికారం కలుగజేయబడగానే కార్మికవర్గాలవారు కొంతవరకు తమ అస్తిత్వం గుర్తింపబడేటట్లు చేసుకొనగలిగారు. దీనికి ఫలితంగానే - ప్రథమ ప్రపంచ సంగ్రామం పూర్తికాగానే తూర్పు, మధ్య యూరపుదేశాలలో చాలావరకు ప్రజాస్వామిక రాజ్యాంగ శాసనాలను తయారుచేసుకొని వాటిలో ఆర్థిక సాంఘిక విషయాలకు సంబంధించిన అనేక హక్కులనుకూడా చేర్చారు. ఈవిషయానికి జర్మనీ (Weimar) రాజ్యాంగ శాసనం ప్రబల నిదర్శనం.

ఆ రాజ్యాంగశాసనం మొత్తం రెండు భాగాలుగా విభజింపబడి నూట ఎనభైఒక్క (181) సూత్రాలను కలిగి ఉన్నది. 80 సూత్రాలను కలిగినఉన్న రెండవభాగం కేవలం జర్మనుప్రజలయొక్క ప్రాధమిక స్వాతంత్ర్యాలనూ, విధులనూ, వివరించడానికే వినియోగింపబడింది. ఈ భాగంలో ప్రధమాధ్యాయం స్త్రీలకు పురుషులతో సమానమైన ప్రతిపత్తినీ, అల్ప సంఖ్యాకులకు సాంప్రదాయ రక్షణకు హక్కునూ, ప్రజలందరికీ వ్యక్తి స్వాతంత్ర్యమునూ అభిప్రాయ ప్రకటనా స్వాతంత్ర్యమునూ ప్రసాదించింది రెండవ అధ్యాయం పూర్తిగా కుటుంబ జీవితానికి సంబంధించినది, గర్భవతులకూ, బహుకుటుంబులకూ ప్రత్యేకరక్షణను ప్రసాదించింది. సక్రమ అక్రమ జన్ములైన బాలురందరకూ తగు పోషణా, ప్రత్యేక రక్షణా ఇచ్చారు. యువకులకు అన్నివిధములైన దౌర్జన్యములనుండీ రక్షణ ఇచ్చారు. మూడవ అధ్యాయం మతసంస్థలన్నింటికీ స్వాతంత్ర్యాన్ని ప్రసాదించింది' ప్రభుత్వోద్యోగులను నియమించుటలో మత విభేదాలను ఏ మాత్రమూ విచారించరాదని నిషేధించారు. నాల్గవ అధ్యాయం విద్యావిషయానికి సంబంధించినది. 18 సంవత్సరములు వయస్సు వచ్చేవరకూ బాలురకు ఉచిత విద్యావిధానమును ఏర్పాటుచేశారు, "కళలకూ, భౌతిక శాస్త్రానికీ సంబంధించిన విద్య ఉచితము, ప్రభుత్వమే దానికి రక్షణనిస్తుంది, దాని అభివృద్ధికై పాటుపడుతుంది" అని వివరించారు ఐదవ అధ్యాయం ఆర్థిక జీవితసన్నాహామునకు వినియోగింపబడింది దాని ప్రధాన లక్ష్యము; 151 వ సూత్రంలో "ఆర్థిక జీవన నియమావళి న్యాయసూత్రాల ననుసరించినీ,

మానవులకు యోగ్యమైన జీవనమును ప్రసాదించు ఆశయము కలదిన్నీ అయి ఉండాలి.....సమాఖ్యా శాసనాల (Federal Laws) ననుసరించి వర్తక వ్యాపారాలకు రక్షణ నీయాలి," అని చెప్పబడి ఉంది. దీని తరువాత పనివారలకు విశ్రాంతీ, ఆరోగ్యరక్షణకు ఇన్సూర్యెన్సూ, వార్ధక్యములోనూ, బలహీన స్థితిలోనూ, జీవితంలో ఇతర ఆపదలు వచ్చినప్పుడూ ప్రత్యేక సహాయమూ, సంఘాలుగా ఏర్పడి వ్యాపారము చేసుకొనే అవకాశమూ, పరిశ్రమల నిర్వహణలో భాగమూ మొదలైన హక్కులను నిర్వచించే సూత్రాలు ఉన్నాయి. సంక్షిప్తంగానే ఉన్నా ఈ వివరణవలన 20 వ శతాబ్దంలో సామ్య ప్రజా స్వామికవాదులు (Social Democrats) భావించిన హక్కుల యొక్క సర్వతోముఖమైన దృష్టి బోధపడుతుంది.

సమావేశ స్వాతంత్ర్యపు హక్కును గురించి ప్రత్యేకంగా చెప్పబడిఉంది. దీనికి 20-వ శతాబ్దపు రాజ్యాంగ శాసనాల్లో ప్రముఖస్థాన మీయబడింది. 18-వ శతాబ్దములోని వారు దీనిని అస లొక ప్రాథమికస్వత్వముగానే పరిగణింపలేదు. పైగా ప్రభుత్వానికీ, వ్యక్తిగతమానవునికీ మధ్యగా ఉండి మానవుడు వ్యక్తిగతంగా తనయెడకూడా భయభక్తులతో మెలగవలె నని కాంక్షించే సంఘమేదీ ఉండకూడదని చాలా మంది అభిప్రాయపడుతూ ఉండేవారు. ఈ అభిప్రాయంలో ఆశ్చర్యపడదగినది ఏమీలేదు. ఆ రోజులలో ఉండిన పంచాయతీలూ, పురపాలకసంఘాలూ మత సంస్థలలాగానే కొంచెం ఇంచుమించు సర్వాధిపత్యాలూ కలిగి అనేక హక్కులనూ, అధికారాలనూ చెలాయిస్తూ వృద్ధిలోనికి రాదలచుకొన్న

ఉత్సాహవంతులైన వ్యక్తుల స్వాతంత్ర్యాన్ని అరికట్టేవి. ఫ్రాంసులో విప్లవకారుల ప్రభుత్వాన్ని స్థాపించి ప్రాథమిక స్వత్వపత్రమును ప్రకటించిన జాతీయసమితి ఈ పంచాయతీలను బర్తరఫుచేయడముతోపాటు శ్రామికులు సంఘాలుగా ఏర్పడటం వారి స్వాతంత్ర్యానికి భంగకరం అంటూ నిషేధించింది కాని పారిశ్రామిక విప్లవజన్యములైన శక్తుల మూలమున ఇదిఅంతా తారుమారయింది. కార్మికులందరూ తమ అనుభవమునలన తమ యజమానులైన పెట్టుబడిదారుల నిరంకుశత్వమును ప్రతిఘటించడానికి ఏకైకమార్గం. తామంతా కార్మికసంఘాలుగా ఏర్పడి వ్యక్తులకు మారుగా సంఘాలద్వారా సంప్రదింపులు సాగించుకొనగలగడమే అని గ్రహించారు. ఈ కార్మికసంమాల వెన్నంటిపెట్టుకొనే వస్తువులను వాడేవారికీ, అరువు తీసుకొనేవారికీ, ఉత్పత్తి చేసేవారికీ ఉపయోగించే అనేకరకాలైన సహకారసంస్థలు బయలుదేరాయి. ఇతర ప్రయోజనాలకొరకు మిత్ర సమితులలాంటి సంఘాలు బయలుదేరాయి. ఇట్టి ఆర్థికసంఘాలతోపాటు భిన్నభిన్న ఆశయాలతోనూ, మంచి కట్టుబాట్లతోనూ రాజకీయ పక్షాలుకూడా బయలుదేరాయి. కొన్ని దేశాలలో చర్చీలూ, ఇతర మతసంస్థలూ చురుకుగా పనిచేయడ మారంభించాయి. ఎక్కడ చూచినా సాంఘికజీవనం అభివృద్ధికావడ మారంభించింది. దానివలన ప్రతిమానవుడూ కేవల మొక పౌరుడుగా ఉండిపోక అనేక సంఘాలలో, జీవితావసరా లెన్ని ఉన్నాయో అన్ని సంఘాలలోనూ సభ్యుడు అయ్యాడు.

ఈవిధమైన నానా ఐచ్ఛికసంఘాలు అభివృద్ధికావడమూ

నానాతరగతులవారి సౌకర్యముల కోసమూ, సౌఖ్యము కోసమూ అవి చేస్తూన్న సేవా ఈ సంఘాలతో ప్రభుత్వం ఎలా వ్యవహరించాలి అనే సమస్యను లేవదీసినాయి. ఆదిలో చాలా ప్రభుత్వాలు ఈ ఐచ్ఛిక సంఘాలకు శత్రువులై ఈ కార్మిక సంఘాలూ, ఇతరసంఘాలూ సక్రమమైనవి కావనీ, వాటిద్వారా వ్యవహరించడానికి తా మంగీకరించ మనీ ప్రకటించాయి. అవి అంత శత్రుత్వం వహించని చోట్లకూడా వాటి పైన తమకు సంపూర్ణాధికారం ఉండాలన్నాయి. ఈ సమస్య పైన చెలరేగిన వాదోపవాదాలమధ్య ప్లూరలిస్టులు (Pluralists) అనే పేరుతో కొందరు విద్వాంసులు ఈ సంఘాలకు అనుకూలంగా పట్టుదలతో వాదించినమీదట వ్యక్తి తన సౌకర్యములకొరకు స్వేచ్ఛగా ఇతర వ్యక్తులతో కలిసి వ్యవహరించుకొనడానికి అతనికి హక్కు ఉండాలి అనే ప్రాథమిక సూత్రం బయలుదేరింది. "రాజకీయ సిద్ధాంతాలు సాధారణంగా ప్రత్యక్షరాజకీయాలకు చెలికత్తెలుగానే ఉంటూ ఉంటాయి" అనే సూక్త్యర్థాన్ని ఈ సమావేశస్వాతంత్ర్య స్వత్వచరిత్రే చక్కగా రుజూచేస్తూంది. 20వ శతాబ్దపు రాజ్యాంగ శాసనాలు ఈ స్వాతంత్ర్యాన్ని స్పష్టంగా ఆమోదించాయి. ఉదాహరణకు చెప్పవలెనంటే, జర్మనీదేశపు రిపబ్లికను రాజ్యాంగ శాసనంలో "నౌకరీలూ, ఆర్థికపరిస్థితులూ, అభివృద్ధి చెందడానికిగాను, స్వేచ్ఛగా సంఘాలను ఏర్పరచుకొనే హక్కు ప్రతివారికీ, అన్ని వృత్తులవారికీ ఉన్నదని హామీఇస్తున్నాము. ఆ స్వేచ్ఛను అరికట్టడానికిగాని, భగ్నంచేయడానికిగాని చేయబడిన ఒడంబడికలూ, ఇతర క్రియలూ అశాస్త్రీయములు"

అని వ్రాశారు. నేను నియంతృత్వమూ, సర్వాధికార ప్రభుత్వ విధానములనుండి ప్రజాస్వామిక ప్రభుత్వమును గుర్తించడానికి ఈ హక్కే అన్నింటికంటె ప్రధానలక్షణముగా గ్రహింపబడుతూంది

ఒకవిధంగా పారిశ్రామికవిప్లవంకూడా ఆస్తిహక్కును గురించి భిన్నదృక్పథం ఏర్పడటానికి కొంత కారణ మయింది. దీనివలన 20-వ శతాబ్దపు రాజ్యాంగశాసనాల్లో దానికి అంత ప్రాముఖ్యత ఈయబడలేదు ఈ విప్లవఫలితంగా మళ్ళీ క్రొత్తరకపు ప్రత్యేకసౌకర్యాలూ, అసామ్యతలూ వెలసినాయి. 18-వ శతాబ్దంలో ప్రత్యేకసౌకర్యాలు కలిగిఉన్న భూస్వాములపైనా, మతాచార్యులపైనా తిరుగుబాటు చేసిన పారిశ్రామికులూ, వ్యాపారస్థులూ, పెట్టుబడిదార్లూ ఇప్పుడు మళ్లీ కార్మిక తరగతులపైన అలాంటి స్థానాన్నే తాము ఆక్రమించుకొన్నారు. ఈ తరగతులవారికి ఆస్తికి సంబంధించిన ప్రాథమిక స్వత్వం కొంచెం ఇంచుమించు అవసరమే లేదు వారికి స్వంత ఆస్తిపాస్తులంటూ ఎక్కువ లేనేలేవు వారు పూర్తిగా పెట్టుబడిదారులైన తమ యజమానుల స్వాధీనంలో ఉన్నారు. ఆచార్యా ఎల్. టి. హాబ్ హౌసు చెప్పినట్లు "అసామ్యతే మన పద్ధతికి ప్రధాన విషయం కాదు. ఇతరులకు సంబంధించిన పెట్టుబడులమీదనూ, భూములమీదనూ ప్రజాసామాన్యం ఆధారపడి ఉండటం అనేది ముఖ్యవిషయం. నేను పుట్టేవారిలో ఆరింట 5 పాళ్లు శిశువులకు ఈ పారిశ్రామికవిధానంలో ఎలాంటిస్థానమూ ఉండ దని నా అభిప్రాయం వారికి వేరే జీవనవిధానమూ ఏమీ లేదు. వారికి చేతులు ఉన్నాయి.

మేధస్సు ఉన్నది. కాని వారికి దున్నుకోనడానికి భూములు లేవు పెట్టుబడికి డబ్బులేదు మనప్రజలలో కొందరికిమాత్రమే వ్యవసాయం జీవనాధారం కాగలదు నూలు వడికేవాడూ, రైలుకూలీ, బొగ్గు గనులలో పనిచేసేవాడూ, వ్యక్తిగతంగా పెట్టుబడులుపెట్టి ఉత్పత్తిసాధనాలను సంపాదించగలుగుతారు అనుకోడంలో అర్థంలేదు ..అసలు ఆస్తి అనే సంస్థ దాని ఆధునికరూపంలో పరమోచ్ఛస్థితిలో బహు సంఖ్యాకులైన ప్రజల జీవితాలపైన అధికారం చెలాయించే హక్కును కొద్దిమంది జనులకు వప్పగించడానికి సాధనమున్నూ, దాని పరమనిమ్న స్థితిలో బహుసంఖ్యాకులకు సక్రమపరిశ్రమకూ ప్రయోజనపూర్వకమైన వృత్తికీ, స్వాతంత్ర్యానికీ స్వయంకృషికీ ఆధారభూతమైన సాధనమున్నూ అయింది" అందువలన ఒక మానవునికి ఇతర మానవులపైన అంత అధికారాన్ని ఇచ్చే ఆస్తిని ఇంకా ఒక హక్కుగా ఉంచాలా అనే సమస్య బయలుదేరింది.

పన్నులను విధించడం విషయంలోకూడా అభిప్రాయాలు మార్పుచెందాయి. విప్లవానికి పూర్వం పన్నులుగా వసూలుచేసినసొమ్ము, ముఖ్యంగా యుద్ధాలకూ, రాజదర్బారుల డాబరాలకూ ఖర్చుచేస్తూ ఉండిన రోజులలో క్రొత్తగా పన్ను విధించడం, ప్రజల ఆస్తిహక్కులో జోక్యం కలుగజేసుకొనడమే నని భావించడం యుక్తంగానే ఉంది కాని ప్రజాస్వామిక పద్ధతి అభివృద్ధిఅయి, పోలీసురాజ్యం అంతరించి దాని స్థానంలో ప్రజాసేవక ప్రభుత్వపద్ధతి అమలులోనికి వచ్చినకొద్దీ పన్నులుగా వసూలుఅయిన ప్రజలసొమ్ము క్రమంగా ఎక్కువగ ప్రజాసామాన్యానికి ఉత్తమ జీవితసౌకర్యాలు కలిగించడానికి

ఉపయోగింపబడుతూంది. కనుక భాగ్యవంతుల తరగతుల పైన పన్నులను విధించడమే ప్రభుత్వానికి అవసరమైన సొమ్మును వసూలుచేయడానికి, ఏకైకమార్గమని నిర్ణయించారు. ఇలాంటి పరిస్థితులలో ఈ ఆస్తిహక్కుపైన మొదట్లో ఉన్న పవిత్రభావం క్రమంగా సన్నగిలి నేడు ప్రతిదేశంలోనూ దానిని పూర్తిగా తొలగించివేయాలనేవారు ఎక్కువ అవుతున్నారు. జర్మను (Weimar) రిపబ్లికువారి రాజ్యాంగ శాసనంలో చాలా సూత్రాలు ఈ ఆస్తిహక్కును గురించిన అభిప్రాయాల పరిణామాన్ని సూచిస్తాయి

అంత తీవ్రమూ, సువిశాలమూ కాకపోయినా అలాంటి మార్పే చర్చా అభిప్రాయప్రకటనల స్వాతంత్ర్యం విషయంలో కూడా కనిపిస్తూంది. ఇది-చర్చించగల సమర్థతా, అవకాశమూ ఉన్న వారికి మాత్రమే అంటే దానికి అవసరమైన విశేష పాండిత్యమూ, ముద్రాక్షరశాలలతోనూ, పత్రికలతోనూ, ఇతర ప్రజాభిప్రాయ ప్రకటనాసాధనములతోనూ సంబంధము కలిగిఉన్నవారికి మాత్రమే విలువైనదిగా భావింపబడుతూంది. శార్మిక వర్గముల ప్రజలకు ఇది ఏమీ ఉపయోగపడదు. పాశ్చాత్య దేశాలలోకూడా ప్రజలందరూ విధిగా నేర్చుకోన వలసినది ప్రాథమికవిద్యవరకే. ప్రజలలో బహుసంఖ్యాకులకు ఉన్నతవిద్యాసౌకర్యాలు లేవు. వారికి చర్చాస్వాతంత్ర్యం ఏమంత ముఖ్యమైనదిగా కనుపించదు. పైగా ఆధునిక పారిశ్రామిక యుగంలో వారు ఎక్కువగంటలు పనిచేయవలసిన అవసరం ఏర్పడటం వలన ఈ వైజ్ఞానిక చర్చలలో పాల్గొనడానికి వారికి తీరుబాటూ ఉండదు. ఈ అశక్తతలకుతోడు అభి

ప్రాయప్రకటనకు సాధనములైన సంస్థలన్నీ పూర్తిగా భాగ్య వంతుల చేతులలో ఉన్నాయని వారు గ్రహించారు. భాగ్య వంతుల అభిప్రాయాలకు భిన్నమైన అభిప్రాయాలను ప్రక టించ దలచుకొన్న వారికి ఆ పత్రికలలోగాని, సభావేది కలలోగాని స్థానముండదు ఇలాంటి పరిస్థితులే ప్రజలలో చాలామందికి ఈఅభిప్రాయప్రకటనాస్వాతంత్ర్యమూ, చర్యా స్వాతంత్ర్యమూ అంటే ఉదాసీనభావం కలిగించాయి. ఇందు వలన వాటిని ప్రజాప్రాథమికస్వత్వాలలోనుంచి తగ్గించివేయా లని ఎవరో కోరుతున్నారనుకోకూడదు. నిజానికి 20_వ శతాబ్దపు రాజ్యాంగశాసనాలలో వాటికే ప్రధానస్థానం ఇచ్చారు.

ఈ సిద్ధాంతం చేసిన ప్రభుత్వకర్తవ్య నిర్వచనంలో వచ్చిన మార్పుకూడా చాలావరకూ పారిశ్రామిక విప్లవ ఫలి తమే అనాలి. 18 వ శతాబ్దంలో మానవుని హక్కులను కాపాడడానికికంకణంకట్టుకొన్నవారు. ప్రభుత్వాం ప్రత్యక్షచర్య తీసుకోరాదనీ, వ్యక్తిని స్వేచ్ఛగా వదలాలనీ వాంఛించారు. ఆ యుగమువారికి అది స్వాభావికంగానే ఉంది, ఎందుకంటే ఆ రోజులలో ప్రభుత్వాలు నిరంకుశపద్ధతుల నవలంబించి కేవలం భాగ్యవంతుల సౌకర్యాలనే దృష్టిలో ఉంచుకొని వాటి రక్షణకోసం యథేచ్ఛగా వ్యవహరించడం వల్ల మేలు కంటే కీడే ఎక్కువ జరుగుతూ వచ్చింది. పైగా అసలు ఈ సిద్ధాంత ప్రతిపాదకులు మధ్యతరగతులవారు. వారు ధన వంతులూ, వ్యాపారస్థులూ కానడంవల్ల ప్రభుత్వసహాయం వారికి ఎక్కువ అవసరంలేకపోయింది. వారు స్వయంగానే

కాలూని నిలబడగలవా రవడంవల్ల స్వయంసహాయక ధర్మాన్ని ప్రబోధించేవారు. కాని 19 వ శతాబ్దంలో రాజకీయ చైతన్యవంతులై తమ నియోజనాధికారంతో ప్రభుత్వంలో భాగం సంపాదించుకొన్న కార్మిక వర్గాలవారు మాత్రం అలాంటివారు కారు. తమ సౌఖ్యానికి అవసరములంటూ వారు కోరుతూన్న హక్కులను సక్రమంగా అమలు జరపడానికి ప్రభుత్వముయొక్క ప్రత్యక్షచర్య అవసరం. ఉదాహరణకు. విద్యావిషయికమైన హక్కు అమలుజరగాలంటే స్కూళ్ళుపెట్టాలి, నిరుద్యోగ నివారణకూ, ఇన్స్యూరెన్సుకూ సంబంధించిన హక్కును అమలు జరపడానికి ప్రభుత్వం పెద్ద మొత్తాలను వెచ్చించాలి. కనీసపు కూలీని నిర్ణయించేహక్కూ, విశ్రాంతికి సంబంధించినహక్కూ, ఆరోగ్యానికీ మాతృసౌకర్యాలకూ సంబంధించిన హక్కులుకూడా ఇల్లాంటివే. 18వ శతాబ్దంలో రాజనీతివిశారదుల మనస్సులలోనున్న వ్యక్తి మధ్యతరగతులకు సంబంధించినవాడు; కాని 20 వ శతాబ్దంలో వారి మనస్సులో ఉంచుకొన్న వ్యక్తి కార్మిక వర్గాలలోనివాడు. ఈ ఆర్థిక తాటస్థ్యవిధానం (Laissez faire) కార్మికునకు ద్విగుణీకృతమైన నష్టమునుకలిగించింది. కనుకనే వారుస్వేచ్ఛగానూ, సమర్థంగానూ సామ్యవాదానుకూలమైన పద్ధతులతో వ్యవహరించగల ప్రభుత్వాలను వాంఛించారు.

అయితే ఇలా ప్రభుత్వాధికారావకాశాలు విశాలం కావడం వలన ఈ ప్రాధమిక స్వత్వసిద్ధాంతం పరిమిత ప్రభుత్వసిద్ధాంతంతో తనకుగల బాంధవ్యానికి విడాకులిచ్చినట్లు భావించకూడదు. ఇంకా అది ఆ సిద్ధాంతానికి కట్టుబడే ఉన్నది.

అది అలా ఉండటమే మంచిది. పారిశ్రామిక వాద తీవ్రతలో చిలవలు పలవలై విజృంభించిన ఆర్థిక జీవితయంత్రం సరిగా పనిచేయాలంటే దానిపై సక్రమాధికారం చెలాయించే సాధనం కావలసి వచ్చినందువలన ఆ ఆర్థిక జీవితావరణంలోకి మాత్రమే ప్రభుత్వానికి ప్రవేశం కలిగింపబడింది. మానవజీవితంలో ఇలాంటి ఆవరణాలు ఇంకా ఎన్నో ఉన్నాయి, వాటి అన్నింటిలో మానవుడు పూర్తిగా స్వతంత్రుడుగా ఉండాలనే ఈ సిద్ధాంతం కోరుతూంది. మాకైవరు చెప్పినట్లు "తాటస్థ్య విధానాని (Laissez-faire) కి ప్రతికూలమైన వాదాలన్నీ సర్వాధికార ప్రభుత్వవిధానానికి (Totalitarianism) అనుకూలమైన వాదాలుకావు. ఆవశ్యకతలశాఖనూ స్వాతంత్ర్యానికి సంబంధించిన శాఖనూ కలగాపులగం చేయరాదు. మనం ప్రస్తుతం అనుభవిస్తూన్న నాగరికత వీటి పరస్పరామోదము మీాదనూ విస్పష్టమైన వీటి పరస్పర భిన్నత్వము మీాదనూ, ఆధారపడి ఉన్నది" ఈ స్వాతంత్ర్యానికి సంబంధించిన శాఖ యొక్క ఆవరణలోనే 'సాధారణంగా అభ్యుదయకరమైన స్వతంత్ర ఆధునిక జీవితములో ఒకమారు ప్రాధాన్యతను వహిస్తూ, ఒకమారు మారుతూ, పెరుగుతూ, విరుగుతూ ఉండే విశ్వాస, అభిప్రాయ, మత, రాజనైతిక, వైజ్ఞానిక ప్రయత్నముల ఆవరణలుకూడా ఇమిడి ఉన్నాయి.

బర్క్, బెంథామూ మొదలైన రచయితలు ఈప్రాథమికస్వత్వ సిద్ధాంతపు ఆదిమ స్వరూపాన్ని, సరిగా అమలు జరిపితే అరాజకత్వం ఏర్పడుతుంది అని విమర్శించారు. నిజంగా అవసరమైనది మానవుని ప్రాథమికస్వత్వ నిర్వచనం

కాదనీ, అతడు నిర్వర్తించవలసిన విధులను అమలు జరిపించ డమూ అందుకొరకు ప్రభుత్వము వారిని గట్టిగా బలవంతపెట్ట గలగడమూ అనీ వారివాదం.'' ప్రజలకు ముఖ్యంగా జ్ఞాపకం చేస్తూ ఉండవలసిన అవశ్యకతగలవి వారివిధులే అని అందరూ అంగీకరిస్తారు, ఆపైన వారికిగల హక్కులు ఏవైనా, వారి అంతట వారే స్వయంగా వాటిని జాగ్రత్తచేసుకుంటారు'' అన్నాడు బెంథాము అనేక యుగాలనుంచీ జనసామాన్యం తనకుగల హక్కులేవో తెలుసుకోకుండానే కాలం గడుపు తూందనిలోగడనే చెప్పాము. అయినప్పటికీ విమర్శనలు చెలరేగు తూనే ఉన్నాయి హక్కుల ప్రకటనే చివరకు మరల విధుల ప్రకటనగాకూడా అవుతుంది'' అని థామస్ పెయిన్ చేసిన ప్రకటనను ఎవరూ లక్ష్యంచేయలేదు. కాని 20 వ శతాబ్దపు రాజ్యాంగశాసనాలలో ఆ విమర్శకులను సంతృప్తిపరచడం కోసం రాజ్యాంగశాసనంలో హక్కులజాబితాతోపాటు విధుల జాబితానుకూడా చేర్చడం అవసరమయింది సాంఘిక ఐక్యత అనే భావం ఒకటి ప్రచారంలో ఉంది, ప్రతిపౌరుడూ తనకు ప్రసాదింపబడిన అనేక స్వాత్వాలను తానుఅనుభవిస్తూన్నందుకు ప్రత్యామ్నాయంగా తాను కొన్ని సాంఘిక విధులను నిర్వ ర్తించవలసిన బాధ్యతనుకూడా కలిగిఉన్నాడని గట్టిగా ఉద్ఘా టించారు.

జర్మనీ (Weimar) రాజ్యాంగ శాసనంలో కొన్ని సూత్రాల్లో ఇది చక్కగా వివరింపబడిఉంది. "పరిపూర్ణమానవులైన భవిష్యత్పౌరులను భౌతిక, మానసిక, సాంఘిక విషయాలలో సమర్థులనుగా తరిబీదుచేయుడం వారి తల్లిదండ్రులయొక్క

ముఖ్యధర్మమున్నూ సహజస్వత్వమునూ అయిఉన్నది. స్థానిక ప్రభుత్వాలు ఈ పని వారు సక్రమంగా నిర్వహించేట్టు చూస్తూ ఉంటాయి,'' (120 వ సూత్రం). శాసనములు నిర్వచించిన ప్రకారం గౌరవోద్యోగాల నంగీకరించి పనిచేయుట ప్రతి జర్మనుపౌరునియొక్క ధర్మము అయి ఉన్నది.'' (132 వ సూత్రం). "పౌరులందరూ శాసనముల నిర్వచించిన ప్రకారం ప్రభుత్వంలోగాని, స్థానిక అధికారవర్గములోగాని పనిచేయ వలసిన విధిని కలిగి ఉన్నారు.'' (133 వ సూత్రం). "పౌరులందరూ ఏవిధమైన మినహాయింపులూ లేకుండా వారివారి రాబడుల ననుసరించి శాసనములలో నిర్వచింపబడిన విధంగా ప్రభుత్వపు పన్నులను చెల్లింపవలెను.'' (134 వ సూత్రం).

ఈ సిద్ధాంతపు చరిత్రలో, ద్వితీయావస్థలో, రాజ్యాంగ శాసనాన్ని తయారుచేసే విధానానికి సంబంధించినంతవరకూ వచ్చిన మార్పులుకూడా తెలుసుకొనదగినవి. రాజ్యాంగశాస నాలలో ఈ ప్రాథమిక స్వత్వాలకు సంబంధించిన భాగాలను దీర్ఘీకరించారు. ప్రభుత్వ కర్తవ్యాన్నిగూర్చినవాదం క్రమంగా బలపడుతూ ఉన్నందువలన అదివరకు వివరించిన హక్కులకు కొన్ని మినహాయింపులనూ, అనన్వయాలనూ, ఆదేశాలనూ కూడా చేర్చి అవసరములైన శాసనాలను చేయడానికి ప్రభుత్వానికి విశేష స్వాతంత్ర్యములను కల్పించారు.

రాజ్యాంగ శాసననిర్మాణముపైన ఈ ప్రాథమిక స్వత్వ సిద్ధాంతం సంపాదించిన అధికారం బాగా బలపడి చివరకు కమ్యూనిష్టురాజ్యమైన రష్యాయొక్క రాజ్యాంగశాసనంలో కూడా ఈ స్వత్వవివరణ జరిగింది. పనికీ, కూలికీ, విశ్రాంతికీ,

సాంఘిక ఇన్స్యూరెన్సుకూ, గర్భిణీ స్త్రీలకు జీతముతో సెలవు ఇచ్చి మాతా శిశువుల క్షేమమును చూడడానికీ దేశంలో విశేషంగా ప్రసూతిశాలలూ, ఆరోగ్యరక్షణశాలలూ, శిశు రక్షణశాలలు ఏర్పాటుచేయడానికీ, జాతిమతాల వివక్షత లేకుండా పౌరులందరికీ సమానహక్కుల నేర్పరచడానికీ, ఆత్మ, వాక్, పత్రికా, సంఘనిర్మాణ, సమావేశ సర్వవిధ సంస్థా నిర్మాణాలకూ సంబంధించిన హక్కులన్నీ ఆ రాజ్యాంగశాస నంలో నిర్వచింపబడినాయి ఈ హక్కులన్నీ పౌరులు అనుభ వించేవి' ఏపనీ చేయనివారికి ఈ ప్రాథమికస్వత్వాలు వర్తిం చవు. అందువలన ఈ హక్కులు కేవలం మానవులందరికీ కావు, కష్టజీవులకూ కార్మికులకూ మాత్రమే వర్తిస్తాయి.

---

## సప్తమాధ్యయము

# హక్కులరక్షణ

మానవునకు సహజంగా కొన్ని హక్కులు ఉన్నాయి అనీ, అవిలేకుండా అతడు వ్యక్తిగతంగా అభివృద్ధిచెందలేడనీ అనుకుంటే ఆపైన ఉదయించే ప్రశ్న: ఆచరణలో వాటికి స్వరూ పమునుఏర్పరచడానికీ, ప్రభుత్వాలు వాటిని నిరాదరించడంగాని నిరాకరించడంగాని చేయకుండా చూడడానికీ ఏమేమిచెయ్యాలి అనేది. ప్రత్యేక వ్యక్తులుకూడా ఈ హక్కులను భంగపరచ వచ్చునన్న మాట కూడా వాస్తవమే, పైగా ప్రభుత్వం శక్తి వంతమైనది కానప్పుడు ఈ అపాయం మరీ ఎక్కువగా

ఉంటుంది కాని ఈసిద్ధాంతాన్ని మొదట తయారు చేసినవారు ముఖ్యంగా నిరంకుశ ప్రభుత్వాలను రూపుమాపడం మీదనే దృష్టినిల్పి ఈ భంగపాటునుగురించి ఏమీ ఆలోచించనట్లు కనబడుతుంది వీటిని ప్రభుత్వము భంగపరచకుండా చూడాలని మాత్రమే వారు కాంక్షించారు. ఈ ప్రయోజనాన్ని సాధించడానికి వారు ఒక సాధారణ ప్రణాళికనూ, మూడు ప్రత్యేక ప్రణాళికలనూ తయారుచేశారు ఈ ప్రత్యేక ప్రణాళికలలో న్యాయస్థాన విమర్శ (Judicial Review) అనే 3-వ దానికి సర్వజనామోదము లభించలేదు

సాధారణ ప్రణాళిక అనగా ప్రజాప్రతినిధి లేక ప్రజాస్వామిక ప్రభుత్వమే అధికారులందరూ అప్పుడప్పుడు జరిగే ఎన్నికలలో విజయంపొంది పదవులలోనికి వచ్చినవారై ప్రజానిర్ణయాలకు లోబడి ఉండేచోట వారు పౌరుని హక్కులకు భంగకరంగా ప్రవర్తించరనీ, పైగా వాటిని సక్రమంగా అమలు జరపడానికి కృషిచేస్తారనీ కొంతధైర్యం. అందువలన ప్రభుత్వం ప్రజలది అయితేనే తప్ప ఈ హక్కులకు అభయరక్ష లభించదనీ, అవి సక్రమంగా ఆచరణలో పెట్టబడవనీ సూత్రీకరించి చెప్పనచ్చు.

ప్రత్యేక ప్రణాళికలు అనగా ఈ హక్కులను స్పష్టమైన అసందిగ్ధమైన భాషలో వరుసగా వివరించడం. ఇలా వివరింపబడిన హక్కులపట్టికను లిఖిత రాజ్యాంగశాసనాల్లో చేర్పించడం, రాజ్యాంగాన్ని కట్టుదిట్టంచేసి దాన్ని సాధారణ ప్రభుత్వోద్యోగుల అధికారాలకు లోబడనిదానిని చేయడము. వీటికితోడు సంయుక్త రాష్ట్రాలలోనూ, ఆ సంయుక్తరాష్ట్రా

రాజ్యాంగశాసనాన్ని అనుసరించి తమ రాజ్యాంగశాసనాలను తీర్చిదిద్దుకొనిన దేశాలలోనూ 'న్యాయస్థానసమీక్ష, (Judicial Review) ను కూడా చేర్చారు దీనివలన న్యాయస్థానాలకు రాజ్యాంగశాసనంలో నిర్వచించిన హక్కులకు భంగకరములైన శాసనాలను గాని, ఇతర ప్రభుత్వచర్యలనుగాని అక్రమమైనవి అనీ, చెల్లవగనివి అనీ ప్రకటించడానికి ప్రత్యేకాధికారం లభించింది. దీనితో ప్రాథమికస్వత్వాల రక్షణబాధ్యత న్యాయశాఖకు వప్పగించినట్లు అయింది

హక్కులను స్పష్టమైన, అసందిగ్ధమైన భాషలో వివరించడం ఎవరూ వాటిని భంగించడానికి అవకాశంలేకుండా సంరక్షించడానికి గాను తీసుకోవలసిన ప్రథమచర్య. దానితో ప్రభుత్వాలు న్యాయసమ్మతంగా ఏమేమి చేయవచ్చునో, ఏమేమి చేయరాదో వాటికి బాగా తెలివిడి అవుతుంది లిఖిత రాజ్యాంగశాసనాల్లో వాటిని చేరిస్తే మతవిషయాల్లో శ్రుతులూ, స్మృతులూ చేసే పనిని ఇవి రాజకీయాల్లో చేస్తాయి ఈ ప్రణాళికయొక్క ప్రాముఖ్యము గురించి పరిషత్తువారి మానవస్వత్వ ప్రకటనయొక్క ఉపోద్ఘాతంలో బాగా వివరింపబడి ఉంది. దాంట్లో "ప్రజల నానావిధ దౌర్భాగ్యాలకూ, ప్రభుత్వ దౌర్జన్యాలకూ ప్రధానకారణాలు తమ అవిద్య, నిర్లక్ష్యము, తిరస్కారభావమూ అనీ, ఈ ప్రకటన సంఘంలోని ప్రతివ్యక్తి మనస్సులోనూ నిత్య ప్రత్యక్షమయి ఉంటూ వారు తమ హక్కులనూ, విధులనూ ఎల్లప్పుడు జ్ఞప్తియందుంచుకొనునట్లు చేయవలెననీ, ప్రభుత్వముయొక్కా, శాసననిర్మాణ కార్యనిర్వాహకశాఖలయొక్కా చర్యలను ఎప్పుడుబడితే అప్పుడు రాజకీయ

సంస్థల ఆదర్శములతో పోల్చిచూడటానికి అవకాశం ఉండటం వలన అవి ఇప్పటికంటె ఎక్కువగా గౌరవింపబడవచ్చును అనీ, ఇకనుంచి ప్రజల వాంఛలు సరళమైన, అప్రతిహతమైన ఈ సూత్రములమీదనే ఆధారపడి ఉంటాయి గనుక అవికూడా రాజ్యాంగశాసనానికి పోషకములుగానూ, సౌఖ్యదాయకములుగానూ ఉంటాయి అనీ, అభిప్రాయపడి ఫ్రెంచి ప్రజాప్రతినిధులందరూ ఒక ప్రజాపరిషత్తుగా సమావేశమయి, తమ సహజసిద్ధములైన, అనుల్లంఘనీయములైన ఈ హక్కులను ప్రమాణపూర్వకమైన ఈ పత్రముద్వారా ప్రకటించుటకు నిశ్చయించారు" అని ఉన్నది. కొంచెం ఇంచుమించుగా ఇదేధోరణిలో థామస్ పెయిన్ కూడా—"అది (అంటే రాజ్యాంగశాసనం) దేశానికి ఒక రాజకీయపు బైబిలు. అదిలేని ఇల్లులేదు. ప్రతి ప్రభుత్వోద్యోగివద్దా దాని ప్రతిఒకటి ఉంటుంది. ఏదైనా ఒక చిత్తుచట్టాన్ని గురించిన చర్చలో దానికి సంబంధించిన సూత్రాలను గురించిగాని, తత్సంబంధమైన అధికారయోగ్యతలను గురించిగాని, వాదనచెలరేగినపుడు శాసనసభాసభ్యులు తమ జేబులలోని రాజ్యాంగశాసనపు అచ్చుప్రతులను బైటికితీసి, ఆ చర్చకు అవసరమైన భాగాన్ని అందులోనుంచి చదివి విని పిస్తారు"—అన్నాడు.

లిఖితరాజ్యాంగశాసనంలో హక్కులనుకూడా చేర్చడం మాత్రమే బలవత్తరరక్షణకాదు, ఆ రాజ్యాంగశాసనం ప్రభుత్వంయొక్క చట్టనిర్మాణ, కార్యనిర్వాహక శాఖలకు లోబడినది కాకుండా ఉండాలి విప్లవయుగభావుకులు రాజ్యాంగశాసనం ముఖ్యంగా ఈ లక్షణాలన్నీ కలిగిఉంటేనే ఆ పేరునకు అది

అర్థమేఉంటుందని అభిప్రాయపడ్డారు. ఇది కొంతవరకు ప్రధానమైన అంశం. ఎంచేతనంటే చాలామంది రాజ్యాంగశాసనాన్ని, ఒకానొక రాజ్యఖండముయొక్క—అది నియంతృత్వమే కానీయండి, ప్రజాప్రాతినిధ్య విధానమే కానీయండి, లేక ప్రజాస్వామికమే కానీయండి—ప్రభుత్వస్వరూపాన్ని నిర్ణయించే కొన్ని సూత్రముల సమ్మేళనము అని నిర్వచిస్తున్నారు. కాని ప్రాథమికస్వత్వముల సిద్ధాంతాన్ని తయారుచేసినవారి దృక్పథం మాత్రం ఇదికాదు. వారు ఈ సందర్భములో మూడు అంశాలను పేర్కొన్నారు. మొదటిది - రాజ్యాంగశాసనం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రజలచేతనే తయారుచేయబడాలి అని. ఇది వారు ఏర్పరచిన ప్రజాప్రభుత్వ సిద్ధాంతాన్ని అనుసరించి ఏర్పడే ఉపసిద్ధాంతం. రెండవ అంశం: అది ప్రభుత్వంయొక్క అధికారాలను నిర్ణయించి, నియమితం చేయాలి—అని, ఇది వారి పరిమిత ప్రభుత్వసిద్ధాంతాన్ని అనుసరించి ఏర్పడే ఉపసిద్ధాంతం. ఇక మూడవది. ప్రభుత్వం రాజ్యాంగశాసనముయొక్క సృష్టిగనుక అది దానికి లొంగి ఉండాలేగాని దానికి తానే సృష్టికర్త అయినట్లూ, యజమాని అయినట్లూ ప్రవర్తించకూడదు. రాజ్యాంగశాసనాన్ని ఏవిధంగానూ మార్చడానికిగాని, సవరించడానికిగాని అధికారం ప్రభుత్వానికి ఉండకూడదు. అటువంటి ఏ మార్పులైనా ప్రజలనుండి అధికారం పొందిన ఒక ప్రత్యేక సంఘంచేతగాని, లేక వేరే విధానముద్వారాగాని జరగాలి. థామస్ పెయిన్ ఈవిషయాన్నే ఇలా చెప్పాడు. "ప్రభుత్వంకంటె ముందుగా ఏర్పడేది రాజ్యాంగశాసనం. ప్రభుత్వం కేవలం ఆశాసనముయొక్క

సృష్టి. ఒక దేశముయొక్క రాజ్యాంగశాసనము ఆ దేశ ప్రభుత్వము చేసిన ఒకశాసనంకాదు, దేశప్రజలు ప్రభుత్వాన్ని శాసిస్తూ చేసినశాసనం అది.. అందుచేత రాజ్యాంగశాసనానికీ, ప్రభుత్వానికీ మధ్యఉండే సంబంధం తరువాత ఆ ప్రభుత్వము నిర్మించిన శాసనాలకీ, న్యాయస్థానాలకీ మధ్యఉండే సంబంధము వంటిది. న్యాయస్థానం శాసనాలను నిర్మించలేదు, మార్చలేదు, ఉన్నశాసనాలను అనుసరించి మాత్రం అది ప్రవర్తిస్తుంది అదే విధంగా ప్రభుత్వసంస్థ రాజ్యాంగశాసనం చేత శాసింపబడుతుంది.

శాసనసభచేసిన ఏ ఒక శాసనాన్నిగాని, కార్యనిర్వాహకశాఖయొక్క ఒక చర్యనుగాని—అవి రాజ్యాంగ శాసనంలో ఉదహరింపబడిన హక్కులకు భంగకరములుగా ఉన్నప్పుడు వాటిని న్యాయవిరుద్ధములు అని ప్రకటించడానికి అవకాశం ఉంటేనే తప్ప లిఖితరాజ్యాంగశాసనంలో హక్కులను చేర్చినందువలన పెద్దప్రయోజనమేమీ లేదు. రాజ్యాంగశాసనంయొక్క ఆధిక్యమును కాపాడేందుకు ఏదైనా ఒక సూత్రం ఉండాలి. అది సర్వాతీతమైన శాసనమనీ, ప్రతివ్యక్తి దానిని శిరసావహించాలి అనీ ప్రకటించినంత మాత్రంచేత చాలదు అటువంటి సూత్రం ఒకటి అమెరికా సంయుక్తరాష్ట్రాల రాజ్యాంగ శాసనంలో పరమప్రధాన మైనదిగా కనిపిస్తుంది. అదే ఆ దేశరాజ్యాంగశాసనముయొక్క వైలక్షణ్యాన్ని చాటుతూంది. ఆదేశంలో రాజ్యాంగశాసనానికి గాని, దానిలో ఉదహరించిన హక్కులకుగాని భిన్నంగా చేయబడిన ప్రభుత్వ శాసనాలనూ చర్యలనూ రద్దుచేసే అధికారం

న్యాయస్థానాలకు ఇవ్వబడింది న్యాయస్థాన సమీక్ష (Judicial Review) అనే పేరుతో అన్ని న్యాయస్థానాలూ ఈ అధికారాన్ని సక్రమంగా చెలాయిస్తున్నాయి ప్రారంభంనుంచీ కూడా పరిమిత ప్రభుత్వవిధానంలో ఇది ఒక అత్యావశ్యకమైన విషయంగా పరిగణింపబడుతూ వచ్చింది. ఈవిషయాన్ని గురించి ఫెడరలిస్టు (Fedaralist) ఇలా చెప్పాడు "నేను అర్థంచేసుకొన్న ప్రకారం, పరిమిత రాజ్యాంగశాసనం అనగా మహా విద్రోహక నిస్స్వత్వశాసనాల (Bills of Attainder) నూ, భూతకాలానికి కూడ అనువర్తింపజేయబడే శాసనాల (Ex-Post-Facto Laws) నూ, ఇంకా ఇలాంటి వాటినీ తయారు చేయకుండా ఉండటమూ మొదలైన కొన్ని నిర్ణీతములైన నిషేధాలను కలిగిఉన్న రాజ్యాంగశాసనము అని నా అభిప్రాయం. ఇలాంటి నిషేధాలను ఆచరణలో కాపాడడానికి న్యాయస్థానాలద్వారాతప్ప మార్గాంతరం లేదు రాజ్యాంగశాసనంలో వ్యక్తంచేయబడిన భావాలకు భిన్నంగా కనిపించే చర్యల నన్నింటినీ అక్రమాలుగా ప్రకటించడం ఆ న్యాయస్థానాల ధర్మం ఈ అవకాశం లేకపోతే ప్రత్యేకంగా హక్కులనూ, సౌకర్యాలనూ చేర్చడంవలన ప్రయోజనం శూన్యం."

ఈ బాధ్యతను న్యాయస్థానాలు చాలా సమర్థంగా నిర్వహించగలవు. ముఖ్యంగా, వాటికి రాజకీయ కక్షలలో జోక్యంలేదు, శాసనసభలూ, కార్యనిర్వాహకశాఖలూ వలె ఇవి ప్రజాభిప్రాయంలో కలిగే మార్పులకు అంతగా విచలించవు. శాసనసభాదికాలకు అది ఎన్నికలలో లభించిన అధికారం, ఆ అధికారం ఒక నిర్ణీతకాలంవరకే ఉంటుంది, వారు

ఎప్పుడూ ఏదో ఒకకక్షకు చెందినవారై ఉంటారు, దేశంలోని సంఘటనలను గూర్చిన వారి అనుభవం హ్రస్వమైనదే గాని దీర్ఘకాలపుది కాదు. చాలా దేశాలలో న్యాయాధిపతులస్థానం దీనికి చాలా భిన్నంగా ఉంది వారి ఉద్యోగాలకు ప్రజల ఎన్నికలతో ఎలాటిసంబంధమూ లేదు, వారి ఉద్యోగాల పరిమితి కొంచెం ఇంచుమించు శాశ్వతం, వారిజీతాలు శాసనసభల ఓట్లమీద ఆధారపడినవి కావు. అందువలన వారు స్వతంత్రంగా నిష్పక్షపాతబుద్ధితో విషయపరిశీలన చేయగలరు. కనుకనే వారినే ఈ ప్రాథమికస్వత్వములకు సంరక్షకులుగా చేయడం ఉత్తమమని భావించారు. న్యాయశాఖను, కార్యనిర్వాహక శాఖలనూ విడదీయాలనే సూత్రానికి కూడా ఇదే సారాంశం.

---

## అష్టమాధ్యాయము

# సిద్ధాంత విమర్శ

ఈ ప్రాథమిక స్వత్వసిద్ధాంతమును గూర్చి ఎప్పటి కప్పుడు అనేకవిధములైన ప్రశ్నలు వేస్తూనే ఉన్నారు. ప్రభుత్వంతో సంబంధంలేకుండా వ్యక్తిగతంగా మానవునికి ఏమైనా హక్కులు ఉన్నాయా అన్నది ఒకప్రశ్న. (ఇక్కడ-సంఘంతో సంబంధంలేకుండా వ్యక్తికి ఏమైనా హక్కులు ఉన్నాయా అనే ప్రశ్నకూ ఈప్రశ్నకూ భేదము ఉన్నదన్న సంగతి గుర్తించాలి.) దీనికి సమాధానం అసలు హక్కులు అంటే మనంచెప్పే అర్థంమీద ఆధారపడి ఉంటుంది. ఆమాటకు చెప్పదగిన అర్థ

మనుగూర్చి ఇదివరకే వివరించాం. ఆ దృష్టితో పరిశీలిస్తే మానవుడు తన సౌఖ్యానికీ, వ్యక్తిగతాభ్యుదయానికీ కృషిచేయ డానికి అవసరముఐెన పరిస్థితులు ప్రభుత్వకల్పితములు కావనీ, మానవానుభవము మీదనూ, మానవస్వభావమును గూర్చిన పరిజ్ఞానముమీదనూ ఆధారపడి ఉంటాయనీ తేలుతుంది. ప్రభుత్వం కేవలం ఈపరిస్థితులను కలిపించడానికి మానవుడు తయారుచేసుకొన్న ఒక ఉపకరణం, - అనేక ఉపకరణాలలో ఒకటి. దీనినిగూర్చి అడుగబడు ప్రశ్నలలో మరొకటి, ఈ హక్కుల నన్నిటినీ కూర్చి జాబితా వ్రాయడం సాధ్యమా అని ఈ ప్రశ్నకుకూడా 'కౌను' అనే సమాధానం చెప్పవచ్చును ఎందుకంటే, మానవులు వివిధయుగాలలో వివిధదేశాలలో భిన్నభిన్న దృక్పథములతో తమ ఆదర్శాలనూ, ఆ ఆదర్శాలను చేరుకొనడానికి మార్గాలనూ ఏర్పాటుచేసుకుంటూ ఉంటారు. ఈ విషయాలు అందరిచేతనూ ఏకగ్రీవంగా ఆమోదింపబడక పోయి ఉండవచ్చును. సాధారణంగా అందరూ అంగీకరించిన భావాలతో అనంగీకారాన్నీ, వ్యతిరేక భావాన్నీ వెలిబుచ్చే ప్రతికూలురు-అన్ని జీవితశాఖలలోనూ ఎల్లప్పుడూ ఉంటూనే ఉంటారు. ముఖ్యంగా కానలసినది ఏకగ్రీవతకాదు, ప్రజా బాహుళ్యముయొక్క సామాన్యాభిప్రాయం. సంధియుగాలలో ఈ ప్రతికూలురసంఖ్య ఎక్కువ అయేమాట కూడా వాస్త వమే. కాని అప్పుడు ఈ ప్రాత అభిప్రాయానుకూలురకూ, దానికి ప్రతికూలురై నూతనాభిప్రాయాలను వెల్లడించేవారికీ మధ్యజరిగే సంఘర్షణకు ఫలితంగా మధ్యేమార్గంగా కొన్ని అభిప్రాయాలు బలపడటమూ, ఆ అభిప్రాయాలే నూతనా

దర్శాలకీ నూత్న స్వాతంత్ర్య ప్రణాళికకూ ఆధారాలు అవడమూ జరుగుతుంది మానవ చరిత్రలో శాంతియుతమైన దశలూ, పరిణామాత్మకములైన దశలూ ఎప్పుడూ ఉంటూనే ఉన్నాయి. అందువలన మనం హక్కుల పట్టికను తయారుచేయలేమని కాదు, ఒక యుగంలోని ప్రజలు తయారుచేసుకొన్న హక్కుల జాబితా మరొక యుగపు ప్రజలకు పనికిమాలినది కావచ్చును అని మాత్రమే దానిభావం ఏ యుగముయొక్క సమస్యలను ఆ యుగమే పరిష్కరించుకోవాలిగాని ఒకయుగమువారు తరువాత యుగాలవారందరికీ పనికివచ్చే నిర్ణయాలు చేయగల మనుకోరాదు గడచిన రెండు శతాబ్దాలలోనూ ఈ హక్కుల జాబితాలో చాలా మార్పులు జరిగాయి అనీ, ఈ సిద్ధాంతము యొక్క ఔన్నత్యము తెలికగా మార్పులకు లొంగగలగడమే అనీ స్పష్టంగా ఇదివరకే చెప్పాం చాలా లిఖిత రాజ్యాంగ శాసనాలలో ఈ జాబితానుకూడా చేర్చి అమలుజరుపుతూ ఉండటంవలన ఆపని ఏమంత కష్టమైనది కాదు అని తేలుతుంది. ఆదిలో ఈ సిద్ధాంతాని పితామహులైనవారు సార్వకాలికంగా ఉపయోగపడే జాబితాను తయారుచేయడం సాధ్యమే అనుకొని పొరపాటుపడినమాట వాస్తవమే. ఆ విషయాన్ని ఇప్పుడు వదిలివేశారు. ఇప్పుడు ఈ సిద్ధాంతాన్ని సమర్థించే వారందరూ దానిలోని విషయాలు మార్పుచేయ దగినవే అని అంగీకరిస్తున్నారు.

ఈ జాబితాలోని హక్కులన్నీ సమాన ప్రాధాన్యం కలవేనా, ఒక హక్కునకూ మరియొక హక్కునకూ – ఉదాహరణకు స్వాతంత్ర్యస్వత్వానికీ సమానత్వస్వత్వానికీగాని,

భద్రతాస్వత్వానికీగాని—సంఘర్షణ రాదా. అలాంటి సంఘర్షణ వచ్చినప్పుడు ఏ హక్కుకు ఎక్కువ ప్రాధాన్యతను ఇవ్వాలి, అన్నది మూడవప్రశ్న. ఈ ప్రశ్నకు సమాధానం చెప్పేటప్పుడు రెండు మూడు విషయాలు జ్ఞాపకం ఉంచుకోవాలి. ఈ సిద్ధాంతం కేవలం ముఖ్యసూత్రాలను గురించే చెపుతుంది. గాని ఆచరణలో సంభవించే చిన్నచిన్న విషయాలన్నింటిని గురించీ వివరించదు. అంతేకాక స్వాతంత్ర్యమూ సమానత్వమూ మొదలైన మాటలను సిద్ధాంతాన్ని తయారు చేసిన వారు ఉద్దేశించిన విధంగానే అర్థంచేసుకోవాలిగాని స్వతంత్రార్థాలు చెప్పకూడదు. అలా అర్థం చేసుకుంటే ఈ వాదోపవాదాలు చాలావరకూ సమసిపోతాయి. 'సమానత్వము' అంటే సమానావకాశాలను కలిగి ఉండుట అనే అర్థాన్ని గ్రహిస్తే స్వాతంత్ర్యస్వత్వంతో దానికి ఎలాంటి వైరుధ్యమూ లేకపోగా ఆచార్యులాస్కి చెప్పినట్లు ఆ రెంటికీ అవినాభావ సంబంధం ఏర్పడుతుంది. కొన్నిచోట్ల అన్ని హక్కులనూ సమానంగా ఏకకాలమందు అమలుపరచడానికి అవకాశం లేకపోతే ముందు వెనుకలనూ అవసరాన్నిబట్టి ఏదో నిర్ణయము చేయవచ్చును. మనం మనకు అత్యంత అవసరాలు అనుకొనే ఆహారమూ, దుస్తులూ, తలదాచుకోవడానికి ఇల్లూ, విశ్రాంతీ మొదలైన వాటిలోనే ఒక్కొక్కప్పుడు ఒకదానికి ప్రాధాన్యం ఇచ్చి తక్కిన వాటిని వెనుకకు నెట్టవలసి ఉంటుంది. ఇంత మాత్రంచేత అవి ప్రధానావసరాలు కాకుండాపోవు. అలాగే ప్రాథమికస్వత్వాల విషయంలో కూడా వ్యవహరించుకొనవచ్చును.

మరొక ముఖ్యమైన ప్రశ్న ఒక దేశంలోని వ్యక్తులందరికీ ఒకే స్వాతంత్ర్యప్రణాళికను వర్తింపజేయాలా, లేక వ్యక్తులనుబట్టి మార్పు ఉండాలా అన్నది ఈ సందర్భంలో ఒక్క విషయం జ్ఞాపకముంచుకోవాలి. ఈ సిద్ధాంతం మొదట, భూస్వాములకూ మతాధిపతులకూ మాత్రమే హక్కులు ఉండి తక్కినవారికి లేని ఒక సాంఘిక రాజకీయ సాంప్రదాయబద్ధమైన రాజకీయ వ్యవస్థకు ప్రతికూలంగా బయలుదేరినది అనే విషయాన్ని ఈ సందర్భంలో జ్ఞాపకంచేసుకోవాలి, అందువలననే సహజంగా మానవుని స్వత్వములకు అంత ప్రాధాన్యం వచ్చింది ప్రతి సంఘంలోనూ వ్యక్తులు వివిధ పరిస్థితులలో వివిధ వృత్తులలో నిమగ్నులై ఉంటారనీ, అందులో కొందరి కొందరి అవసరాలు మిగిలినవారి అవసరాలకు భిన్నంగా ఉంటాయి అనీ అనుభవంవలన గ్రహించవచ్చును. పసిపిల్లల అవసరాలు వేఱు, పెద్దవారి అవసరాలు వేఱు, కొంతవరకు స్త్రీల అవసరాలు వేఱు, పురుషుల అవసరాలు వేఱు, అలాగే పనివారల అవసరాలు వేఱు, యజమానుల అవసరాలు వేఱు, కాని దీని అంతటినుండి తెలుసుకొనదగినది మానవులకు కేవలం మానవ మాత్రులుగా ఏమీ హక్కులులేవు అని కాదు, అందరికీ వర్తించేవి కొన్ని హక్కులు ఉంటే, కొందరు ప్రత్యేక వ్యక్తులకు సంఘంలో వారు వారు నిర్వహించే పనులనుబట్టీ, వారి విలక్షణమైన స్థానాన్ని బట్టీ, మరికొన్ని ప్రత్యేకపు హక్కులను ఈయవలసి ఉంటుంది అని. ఈ విషయాలను గుర్తు ఉంచుకొనే ఈ సిద్ధాంతాన్ని సవరించారు అనీ, 20_వ శతాబ్దంలో తయారుచేయబడిన రాజ్యాంగశాసనాల్లో మానవు లందరికీ

వర్తించే హక్కులతోపాటు స్త్రీలూ, శిశువులూ, కార్మికులూ, రైతులూ మొదలైన ప్రత్యేక వర్గాలవారికి వర్తించే హక్కులు కూడా చేర్చబడినాయి అనీ ఇదివరకే చెప్పాం. ఇంకా కోర దగినది ఈ పద్ధతులమీద ఈ సిద్ధాంతాన్ని ఇంకా విస్తృతం చేయాలి అనే గాని దానిని రద్దుచేయాలి అని కాదు.

ఇలా ప్రత్యేకవర్గాలవారి హక్కులనుచేర్చి జాబితాను పెంచడంతో ఒక చిక్కుకూడా ఉంది. మానవసంఘ స్వభావాన్ని గురించి మార్క్సువాదులూ, వర్గసంఘర్షణలు ఎలాగూ తప్పవు అని వాదించేవారూ, అందరూ భిన్నభిన్నాభిప్రాయాలను వెల్లడిస్తూ ఉండటంవలననే పైన చెప్పిన చిక్కు సంభవించింది, వర్గానికీ వర్గానికీ మధ్యఉండే వైరుధ్యాలు చాలా తీవ్రమువైనవి అనీ ఒక వర్గక్షేమం మరొకవర్గానికి విపరీతంగా నష్టకరము అనీ అందువలన వీరికీ వారికీ అందరికీ హక్కులను కలుగజేయడం అసంభవమనీ వారివాదన. కూలీలకు హక్కులను కలుగజేస్తే యజమానుల హక్కులకు భంగకరంగా ప్రవర్తించినట్లు అవుతుంది గనుక ఈ భిన్నవర్గాలకు రాజీ కుదిర్చి అన్ని దృక్పథాలనుండీ ఉభయవర్గాలకూ అంగీకార యోగ్యములైన ఉభయతారకములైన హక్కులనే రాజ్యాంగ శాసనంలో చేరుద్దామని చేసే ప్రయత్నాలన్నీ ఇంచుమించు వ్యర్థమే అని వారి అభిప్రాయం. మార్క్సు సిద్ధాంతాల యోగ్యతాయోగ్యతలను గురించి విపులంగా చర్చించడానికి ఇది అదనుకాదు: ఆ సిద్ధాంతాలు చాలా తీవ్రవాద పూరితాలు అనీ, సంఘంలో ఆర్థికవిభిన్నతలు ఉన్నా సాంఘిక ఐకమత్యము నకు కారణములైన అనేక ఇతరవిషయాలుకూడా ఉన్నా

యనీ మాత్రం చెపితే చాలును. హక్కులకోసం అన్నివర్గాలూ పోరాడుతూనే ఉన్నా వాటిలో అన్నివర్గాలకూ సమాన ప్రాముఖ్యం ఇవ్వవలసిన అవసరంలేదు. ఒకవర్గం ఎంతవరకు అభివృద్ధిపొందినదీ ఏస్థితిలో నున్నదీ పరిశీలించినచో కొన్ని పనులు తక్కినవాటికంటె ప్రధానమైనవి అని తేలుతుంది. జన బాహుళ్యంలో ప్రబలమైఉన్న అభిప్రాయాన్నే ఆధారంచేసు కొని వివిధ వర్గాలయొక్కా తరగతులయొక్కా ప్రాముఖ్యము లోని తరతమభేదాలను నిర్ణయించవచ్చును. ఇలా కొంత సమన్వయంచేసే అవకాశంఉంది గనుక పైన చెప్పిన చిక్కు అంత విడనిదికాదు. ఈ విషయం జర్మన్ రిపబ్లిక్ వారియొక్కా యుగోస్లావియూరొయొక్కా, వెనుకటి ప్రపంచసంగ్రామానంతరం వెలిసిన ఇతర మధ్యయూరపురాజ్యాలయొక్కా రాజ్యాంగ శాసనాల్లో వారు చేర్చిన హక్కుల పద్ధతి వలన స్పష్టంగా తేలు తూంది.

సంఘంలో కేంద్రీకృతమైన శక్తిని, అధికారాన్ని నిర్వ హించే ప్రభుత్వం, వ్యక్తిగతంగా సంఘంలోని స్త్రీ పురుషుల సర్వతోముఖాభివృద్ధికి పాటుపడే ఒకసాధనమేగాని — ప్రభు త్వాన్ని నెలకొల్పడమే పరమలక్ష్యంకాదని నొక్కి చెప్పడమే ఈ ప్రాథమిక స్వత్వసిద్ధాంతముయొక్క విశిష్టత. ఈ సిద్ధాం తంలో ఇమిడిఉన్న సత్యాన్ని సిద్ధాంతముయొక్క యోగ్య తనూ అమోదించక పోవడము అంటే, ప్రభుత్వ పదానికి పై నిర్వచనమును అంగీకరించక పోవడం అన్నమాట ఈ అభి ప్రాయంలోనే— యోగక్షేమాలు అంటే వ్యక్తులయొక్క యోగక్షేమాలే. రాష్ట్రాలూ, జాతులు, మతాలూ, వర్గాలూ

మతసంస్థలూ మొదలైన సంఘాలు పెద్దవి అయినా చిన్నవి అయినా వాటిస్వభావాలు ఎలాంటివైనా వాటితో నిమిత్తం లేకుండా అందరి యోగక్షేమాలూ అనే భావంకూడా ఇమిడి ఉంది. వ్యక్తే సర్వశక్తికీ మూలస్థానం. అతడు సంబంధం పెట్టుకొన్న ప్రతిసంస్థా - ప్రభుత్వం కూడా అలాంటి సంస్థలలో ఒకటి,- అతని శక్తిని ఎంతవరకూ బహిర్గతం చేయగలదో, అతని స్వాతంత్ర్యాన్ని ఎంతవరకు విపులం చేయగలదో విచారించి దానిని బట్టి ఆ సంస్థయొక్క విలువను కట్టాలి. ప్రాథమికస్వత్వ సిద్ధాంతం ఈ ప్రయోజనాన్ని అద్భుతంగా సాధించింది అది వ్యక్తిని ప్రభుత్వ నిరంకుశత్వములోనుండి ముక్తుణ్ణి చేసింది. వెనుక చెప్పినట్లు ఇది ఆధునిక ప్రజాస్వామిక రాజ్యాంగపద్ధతికి పునాదివంటిది ఈ రాజ్యాంగ పద్ధతిలో మానవజాతికి విశ్వాసం ఉన్నంతకాలమూ ఈ సిద్ధాంతము యొక్క విలువ శాశ్వతంగా నిలచిఉంటుంది ప్రస్తుతం ప్రజాస్వామికము లని పిలువబడుతూ ఉన్న సీమలలో కూడా పూర్తిగా ప్రజాస్వామిక పద్ధతులు ఏర్పాటుచేయబడి లేవు. పేర్లు మారినా కులతత్వాలూ, ప్రత్యేకసౌకర్యాలూ, ఇప్పటికి చాలా దేశాల్లో అమలులో ఉన్నాయి. అలాంటి దేశాలలో కూడా ప్రాథమికస్వత్వ సిద్ధాంతం చేయవలసిన ప్రధాన కార్యం ఒకటి ఉంది. ఆధునిక ప్రపంచంలో సర్వాధికార ప్రభుత్వ పద్ధతీ (Totalitarianism) నియంతృత్వ విధానమూ బాగా తలలెత్తగానే ప్రజలకు బాగా కనువిప్పు అయి వెనుకటికంటె ఎక్కువగా వారు ఈ సిద్ధాంతముయొక్క ప్రాముఖ్యమును గ్రహించారు.

ఇక ఈ సిద్ధాంతానికి ప్రతికూలంగా బయలుదేరిన కొన్ని విమర్శలనుకూడా మనం పరామర్శించాలి. ఈ సిద్ధాంతం ముఖ్యంగా నైతికమైనది అని ఇప్పటికే తేలిపోయింది. ప్రభుత్వం చేయదగిన సత్కార్యాలనూ, చేయతగని నిషిద్ధకార్యాలనూ అది నిర్వచిస్తుంది. ప్రభుత్వం ఇలాంటి నైతిక సిద్ధాంతాలకు కట్టుబడి పనిచేయాలా ? ఒకవేళ అలా చేయవలసే వస్తే ఈ హక్కులను కేవలం రాజకీయ సూత్రాలుగా కుదించడం అవసరమూ క్షేమకరమూ అవుతుందా ?— అనేవి ఇప్పుడు వచ్చే ప్రశ్నలు. లోగడ చెప్పినట్లు అధికార రాజకీయాల (Power Politics)ను సమర్థించే 'మాచియవిల్లీ', 'హాబిసు'ల వంటివారు వ్యక్తిగత నైతిక సూత్రాలు ప్రభుత్వానికి వర్తించవు అని నిర్ణయించారు. ఈ అభిప్రాయము వలన సంభవించే ప్రమాదకరములైన ఫలితాలను గురించి ఇంతకుపూర్వం చర్చించాం. కనుక వ్యక్తిగత, సామాజిక నీతి సూత్రాలకు భిన్నత్వమును పాటించడం యుక్తంకాదని స్పష్టమవుతూంది. వివిధ పరిస్థితులలో ఆచరణలో కొంతకొంత మార్పు అవసరమైనా, నైతిక సిద్ధాంతం సర్వత్ర ఒక్కటే.

వీటిని కేవలం రాజకీయసూత్రాలుగా కుదించివేసి రాజ్యాంగ శాసనాల్లో చేర్చివేయడమేనా అన్న ప్రశ్నకు కూడా అనుకూలమైన సమాధానమే వచ్చింది. కాని ప్రజాస్వామిక దేశాలలో అలాచేయవలసిన అవసరం ఉండదని కూడా కొందరు అభిప్రాయపడుతున్నారు. ఫెడరలిస్టు గ్రంథకర్త తన అభిప్రాయాన్ని ఇలా ప్రకటించాడు: "ఈ హక్కుల చట్టాలు ఆదిలో రాజులకూ ప్రజలకూ మధ్యజరిగిన బేరాలుగా

ప్రారంభమయి, రాజుయొక్క ప్రత్యేకాధికారాలను తగ్గించుకొని వాటికిబదులు కొన్ని ప్రత్యేక సౌకర్యాలను ఏర్పాటు చేయడంగానూ, రాజులయొక్క అధికారానికి లోబడని హక్కులను ఏర్పాటు చేయడంగానూ నిజానికి చాలాసారులు వర్ణింప బడ్డాయి... అందువలన వాటికి మొదట చేయబడిన నామకరణాన్ని బట్టి నిదర్శన పూర్వకమైన ప్రజాశక్తిచే తయారుచేయబడి, ప్రజల సన్నిహిత ప్రతినిధులచే అమలు పరచబడే రాజ్యాంగశాసనాలతో వాటికి సంబంధం లేదు అని స్పష్టం అవుతూంది ఇక్కడ ప్రజలకు లేని అధికారం ఏమీ లేదు; సర్వాధికారాలూ వారివే గనుక వారికి ప్రత్యేకపు మినహాయింపులతో అవసరంలేదు" ఫిలడెల్ఫియా పరిషత్తు వారిచే తయారుచేయబడిన రాజ్యాంగ శాసనమును ఆమోదించవలసి వచ్చినప్పుడు, దానిలో హక్కులచట్టాన్ని చేర్చలేదనే కారణంతో దానిని ఆమోదించడానికి అభ్యంతరం చెపితే, పై వాక్యాలను ఫెడరలిస్టు దానికి సమాధానంగా వ్రాశాడని కూడా గుర్తు ఉంచుకోవాలి ప్రజాప్రభుత్వాలు గల దేశాలలో ఈ సిద్ధాంతం అవసరం అని ఆయన వాదం. ఈ అభిప్రాయాన్ని ఇదివరలో పరిశీలించాము ప్రజాప్రతినిధి శాసనసభలు వ్యక్తులయొక్క, అల్పసంఖ్యాక సంఘాలయొక్క హక్కునకు భంగకరంగా ప్రవర్తించకుండా ఉండటానికిగాను ఒక రక్షణ అవసరం కనుక ఈ నైతిక సిద్ధాంతాలను రాజకీయసూత్రాలుగా మార్చి వాటిని లిఖితపూర్వకంగా రాజ్యాంగ శాసనంలో చేర్చడం అవసరం అని వెనుక నిర్ణయించాం.

ఈ సిద్ధాంతాన్ని రాజ్యాంగశాసనంలో చేర్చడం అపాయకరం అంటూ మరొక అభ్యంతరం కూడా చెప్ప బడింది. ఇదికూడా ఫెడరలిస్టు వెల్లడించిన అభిప్రాయమే. ఆ గ్రంథకర్త ఇలా వ్రాశాడు. "నేను ఇంకా ముందంజవేసి హక్కుల చట్టాలను అవి కావాలని పోరాడేవారు వాటికి చెప్పిన నిర్వచనాన్నీ వర్ణననూబట్టే చూచినా మనం ఏర్పాటు చేయదలచుకొన్న రాజ్యాంగశాసనంలో వాటిని చేర్చడం కేవలము అనవసరమే కాక ప్రమాదకరం కూడాను, అని చెబుతున్నారు. రాజ్యాంగశాసనంద్వారా ప్రసాదింపబడని అనిర్దిష్టాధికారాలకు ఈ హక్కులు కొన్ని మినహాయింపులు అవుతాయి. ఈ వీలు కనిపెట్టి ఇదే సాకుగా చెప్పి, ప్రసాదింపబడిన వాటికి తోడు ఇంకా చాలా అధికారాలు తమకుఉన్నట్లు ప్రభుత్వాలు వ్యవహరించ వచ్చును ఈ వాదం సక్రమంగానే కనిపిస్తూంది. దీనిని ఎంతసూక్ష్మంగా పరిశీలించినా హక్కులన్నిటినీ నిశ్శేషంగా వ్రాయడం అసంభవంగానే తోస్తూంది. పైగా అలాచేస్తే రాజ్యాంగశాసనం చాలా దీర్ఘమైనదై గజిబిజిగా తయారు అవుతుంది కనుక అదీ కోరదగినదికాదు. చాలా మినహాయింపులు ఉండకనూ తప్పదు, అవి రాజ్యాంగ శాసనంలో లేవు అనే కారణం చూపించి ప్రభుత్వం వాటిలో జోక్యం కలుగజేసుకోనూవచ్చును. ఈ పరిస్థితికూడా నిర్దిష్టంగాలేదు. వచ్చేప్రమాదం కొంచెం ఇంచుమించు ఊహాజనితమైనది. కేవలం అన్నిహక్కులనూ చేర్చడమో లేక అన్నింటినీ ఎత్తివేయడమో, ఈ రెంటిటిలోనే ఏదో ఒకటి జరిగి తీరాలని ఎక్కడఉన్నది? కొన్ని హక్కులనైనా సంపాదించడమూ,

తరువాత ఎప్పుడైనా ఇంకా ఎక్కువ హక్కులు అవసరము లైనప్పుడు జాబితాను మళ్లీ సవరించుకోవడమూ జరుగ వచ్చును.

ఇక దీనిపైన వచ్చిన మూడవరకమైన విమర్శ అసలు రాజ్యాంగ శాసనంలో చేర్చినప్పటికీ ఈ హక్కులు సక్రమంగా అమలు పరచ బడతాయా? ఆదిలో ఉద్దేశించిన ప్రయోజనం ఆచరణలో కలిగినదా? అన్న ప్రశ్నలు సంయుక్తరాష్ట్రాలలో భయంకరమైన ఒక అంతర్యుద్ధం జరిగిన తరువాత నీగ్రోల తర ఫున వాదించేవారు రాజ్యాంగశాసనంలో 14-వ సవరణను చేర్చగలిగారు. అది ఇలాఉంది "సంయుక్తరాష్ట్రాల్లో జన్మించి లేక స్థిరనివాసులయి, లేక ఆ దేశముతో సంబంధముకలిగి ఉన్నప్రజలందరూ సంయుక్తరాష్ట్రముల యొక్కయూ, తత్రాపి వారునివసించు రాష్ట్రముయొక్కయూ పౌరులు అయిఉన్నారు. ఏ రాష్ట్రమునూ సంయుక్త రాష్ట్రపౌరులయొక్క సౌకర్యము లనుగాని క్షుద్రతనుగాని భంగపరచే ఏ విధమైన శాసనమునూ చేయుటగాని అమలు జరుపుటగాని చేయరాదు, ఏ రాష్ట్ర మునూ ఏ వ్యక్తియొక్క ప్రాణమునుగాని, స్వాతంత్ర్యమును గాని, ఆస్తినిగాని న్యాయవిచారణ చేయకుండా హరింప కూడదు, తన సరిహద్దులలోని ఏ వ్యక్తికీ తన శాసనముల యొక్క రక్షణను లేకుండా చేయకూడదు." స్వాతంత్ర్యపు హక్కును ఇంతకంటె విస్పష్టమైన శక్తిమంతమైన భాషలో చెప్పిన సూత్రం మరి యే రాజ్యాంగ శాసనంలోనూ కనుపిం చదు.అయినప్పటికీ ఇన్నాళ్ళనుంచీ సంయుక్త రాష్ట్రాల్లో నీగ్రోలు నిమ్నజాతివారుగానే పరిగణింప బడుతున్నారు.

ఈ సిద్ధాంత విమర్శకులు దీని నిష్ప్రయోజకత్వమును గురించి చెప్పేటప్పుడు వారు దృష్టిలో పెట్టుకొన్నది కేవలం ఈ 14-వ సవరణను మాత్రమే కాదు. న్యాయస్థాన సమీక్ష (Judicial Review) కు అవకాశంలేక కేవలం శాసనసభలు తమ అధికారాలను తామే నిర్ణయించుకొనే యూరప్ ఖండ రాజ్యాలవంటి చోట్ల ఈ హక్కులను కాపాడడంలో కలిగే కష్టాన్ని గురించికూడా వారు ప్రసాదించారు. దీనికి విరుగుడు న్యాయస్థానసమీక్షకుకూడా వీలు కలిపించడమే. మరొక ప్రశ్న: ఈ న్యాయస్థాన విమర్శవలనమాత్రం ఈ హక్కులను మొదట రాజ్యాంగ శాసనాన్ని తయారుచేసినవారు ఉద్దేశించినవిధంగా ఆచరణలో పెట్టించడం సాధ్యం అవుతుందా అని. ఈ సందర్భంలో అమెరికావారి అనుభవం మనకు చాలా ప్రయోజనకారి న్యాయస్థానసమీక్ష ఈ హక్కులను ఆచరణలో బలపరచినా వాటికి నిశ్చితమైన అర్థాన్నీ, విస్పష్టతనూ లేకుండాచేస్తుంది. అని అమెరికనుల అనుభవం వలన రుజూఅయింది. నిజానికి న్యాయాధిపతులుకూడా మానవులే. వారికి ఉండే అభిమానాలూ అనుమానాలూ వారికీ ఉంటాయి వ్యాఖ్యానం చేయవలసినదిగా వారికి వప్పగించబడిన శాసనాలను విమర్శించేటప్పుడు మంచిచెడ్డలను గురించిన వారి స్వకీయాభిప్రాయాలతోనే వారు విచారిస్తారు. కాక గత్యంతరం లేదు. ఆచార్య 'ఫైనరు' చెప్పినట్లు ఆక్షేపించడానికి అవకాశం ఏమాత్రమూ లేకుండా అధికారయుతంగా వ్యాఖ్యానంచేసే సర్వసమ్మతమైన విధానంఅంటూ ఒకటి ఎప్పుడూ ఉండదు. దీనికి ఫలితంగా న్యాయాధి

పతులు 'న్యాయశాస్త్రానుసారమైన సక్రమచర్య,' 'వ్యాపార' 'సాంగత్య స్వాతంత్ర్యము' వగైరా పదాలకు అనేక విధాలుగా అర్థాలు చెప్పడమూ, హక్కుల రక్షణవిషయం సందేహంలో పడడమూ జరిగింది. ఇది రాజ్యాంగ శాసనవిషయంలో కానీండి, సాధారణ శాసనాల విషయంలోనే కానీండి, న్యాయాధిపతి వ్యాఖ్యానాలకు ఈ లక్షణం స్వభావసిద్ధం అయిపోయింది. ఇందుచేత న్యాయశాసనాలకు వ్యాఖ్యానం చేయవలసినఅవసరం లేదని యెవరూ వాదించరు. దీనినుంచి గ్రహింపవలసిన విషయ మల్లా హక్కులను కాపాడే విషయంలో న్యాయాధిప వ్యాఖ్యానం ఫలవంతం కావడంలేదని కాదు, ఈ విషయంలో దానికి కొన్ని ఇబ్బందులు ఉన్నాయని మాత్రమే. అది సర్వ సమర్థమైన ఉపకరణం కాదు.

ప్రభుత్వం నిర్మాణాత్మకములైన కొన్ని కర్తవ్యాలను నిర్వహించాలి అని కోరే హక్కుల విషయంలోకూడా కొన్ని ప్రశ్నలు బయలుదేరాయి. మొదటివిషయం-ప్రభుత్వం కొన్ని శాసనాలను చేయగలిగి దానికి అవసరమైన ఉద్యోగివర్గాన్ని ఏర్పాటుచేసి ఎంతో ఖర్చుపెడితేనేగాని ఆ హక్కులు అమలు జరుగవు. కాని శాసనసభలు, ప్రజాస్వామిక పద్ధతిలో ఎన్నుకోనబడినవే అయినా - ఇలాంటి కార్యాలకు పూనుకోవడంలో శ్రద్ధగా పనిచేయకపోవచ్చును. ఈ శాసనసభలు ఇలాంటి హక్కులను గూర్చిన సందర్భాలలో ఇలా ఆలస్యంగా పనిచేయ వచ్చును అనే భయంతోనే యుద్ధానంతరం తయారు చేయ బడిన రాజ్యాంగశాసనముల నిర్మాతలు - శాసనసభలు అవ సరములైన శాసనాలను చేసి వివిధవిధులను వివరంగా నిర్ణ

యించాలి—అన్న మరొక సూత్రాన్నికూడా రాజ్యాంగశాసనాల్లో చేర్చారు. ఇలాంటి సూత్రం ఒకటి ఉన్నప్పటికీ అన్ని హక్కులనూ సక్రమంగా అమలుపరచడానికి ఒక విస్తృత ప్రణాళికను ఏర్పాటుచేయడం ప్రభుత్వశక్తికి మించినపని కావచ్చును. ఉదాహరణకు — వీమరు రిపబ్లికువారి రాజ్యాంగ శాసన గర్భస్థమైన సిద్ధాంతం సాంఘిక ప్రజాస్వామ్యపద్ధతే. అర్జనాత్మకమైన మానవసంఘమును కార్యాచరణ తత్పరసంఘముగా మార్చవలెననే ఆశయంతో ప్రాథమికస్వత్వముల జాబితాను వారు తయారుచేశారు. ఈ పని కొన్ని తరాలవారు గాని సాధింపలేని దన్నమాట విస్పష్టంగానే తెలుస్తూంది. ప్రాథమికస్వత్వ సిద్ధాంతం నిరుపయోగకరమైన దని చాలా మంది వాదించడానికి ఈ చిక్కే కారణం.

ఈ విమర్శకులకు సమాధానం చెప్పవలెనంటే రెండు విషయాలను జ్ఞాపకం ఉంచుకోవాలి. నిజానికి ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం ఈ హక్కులకు ప్రధానస్థానాన్ని ఇచ్చిన రాజ్యాంగ శాసనాలు తయారుచేసుకొన్న మధ్య యూరపు రాష్ట్రాల్లో చాలావాటిలో దీనికి అవసరమైన శాసనాలను చేయడానికి ప్రత్యక్షంగా ప్రయత్నాలు జరిగాయి. రెండవది జూర్చెర్ ఆచార్యుడు చెప్పినట్లు "ఇది ఇలా జరుగకపోయినట్లయితే, హక్కుల చట్టాలను వట్టి మాటల మూటలుగా భావించడం ఇంకా ఆధారరహితమైనది అవుతుంది. వాటి తత్క్షణ ఫలితాల మాట ఎలాఉన్నా అవి ఇప్పటికీ, ఎప్పటికీ బహిరంగచర్యలకు న్యాయశాస్త్ర ప్రమాణాలుగా ఉంటూనే ఉంటాయి. వాటిలోని పదజాలం అసంబద్ధంగానూ విరుద్ధం

గానూ ఉంటే ఉండవచ్చును, అవి న్యాయవాదికి ఉపయోగించే విషయ సంగ్రహములుగా కాక కేవలం రాజకీయ వాగాడంబరములుగానే కనిపిస్తూ ఉండవచ్చు. అయినప్పటికీ భద్రంగా రాజ్యాంగ శాసనంలో చేర్చగానే ఈవాక్యాలు అదేకారణంగా రాజకీయాచారాలుగా ఉండటం మానుకొని న్యాయశాస్త్ర సూత్రాలుగా తయారవుతాయి. సాంఘిక స్వాతంత్ర్యముల విషయంలో ఈవాక్యాలు ఇంతా పూర్తిగా అన్వయిస్తాయి. అది వరకు ఇవి కేవలం రాజకీయ వినాదాలుగానూ, సంఘంలో నోరూవాయీ లేని అభాగ్యులకోరికలను వ్యక్తంచేయబూనుకునేరాజకీయనాయకునికి పనికివచ్చే పదజాలంగానూ మాత్రమే ఉంటూఉండేవి కాని నాటినుంచీ ఆ దేశంయొక్క ప్రాథమిక న్యాయశాస్త్రంలో ఒకస్థానాన్ని సంపాదించుకున్నాయి, అవి న్యాయశాస్త్ర విషయిక ప్రాథాన్యాన్ని, రాజకీయ ప్రాధాన్యాన్నికూడా సంపాదించుకొన్నాయి. అందుచేత ప్రభుత్వం యొక్క సామాన్యకార్యకలాపంలో వాటిని ఫలవంతములుగా చేయడానికి న్యాయవాదీ, రాజకీయ నాయకుడూకూడా సమానంగా ప్రయత్నించవలసిఉంది

శాసన నిర్మాణంలో కనిపించే నిర్లక్ష్య నిర్లిప్తతల వలన మాత్రమేగాక ఆ శాసనాలను ఆచరణలో పెట్టేందుకు న్యాయశాస్త్రవిషయిక సమర్థనలు ఎంతమాత్రమూ ఉపయోగపడలేకపోవడం వలనకూడా ప్రభుత్వమునుంచి ప్రత్యేకచర్యను అర్థించే హక్కులు ఎక్కువ శక్తిమంతములుకావు అని సయితం వాదించారు. ఉదాహరణకు జర్మను రాజ్యాంగశాసనంలో ఆ విషయమైన ప్రయత్నం ఏదీలేనప్పుడు ఏ ఒక ప్రత్యేక

వ్యక్తి అయినా ప్రభుత్వానికి వ్యతిరేకంగా న్యాయస్థానాలలో దావాచేసి అట్టి ఏర్పాటు జరగాలి అనే తీర్పును సంపాదించ డానికి వీలు ఉన్నదా? నిజానికి న్యాయస్థానాలు ఎన్నటికీ అటు వంటి తీర్పులను జారీచేయవు. న్యాయస్థానములయొక్క ఈ అలసత్వానికి కారణాలు న్యాయశాస్త్ర సంబంధమునైన విష యాలకూ రాజకీయాలకు సంబంధించిన విషయాలకూ గల భేదాను సంయుక్త రాష్ట్రాల న్యాయస్థానాలుకూడా గుర్తించ డమూ, న్యాయస్థానాలు ఉన్నత రాజకీయ పథకాలకు సంబం ధించిన విషయాలలో తాము జోక్యము కలిగించుకోము అనడమూ.

ఈ పరిస్థితులవలన గ్రహించదగిన విషయం – ఈ హక్కులను రాజ్యాంగ శాసనంలో చేర్చడంవలన ప్రయోజ నము లేదు అనికాదు, ఆహక్కులను రక్షించుకొనడానికి పౌరులు కేవలం న్యాయస్థానాలమీాదనే ఆధారపడక ఇతర సాధనాలను కూడా చూచుకొనాలి అని. ముఖ్యంగా కావలసినవి సజీవమైన ప్రజాభిప్రాయమూ, ప్రజల నిరంతర జాగరూకతా, ఆచార్య లాస్కీ చెప్పినట్లు ఏ హక్కుల చట్టమైనా సక్రమంగా అమలు జరగడము అది అమలు జరగాలి అనే ప్రజానిశ్చయముయొక్క బలముమీాద ఆధారపడి ఉంటుంది. ఇలాగే పత్రికా స్వాతం త్ర్యాన్నిగురించి వ్రాస్తూ ఫెడరలిస్టుకూడా "దానిని గురించి రాజ్యాంగ శాసనంలో ఎంతగట్టిగా వక్కాణింపబడి ఉన్నా దాని భద్రత సాధారణంగా ప్రజాభిప్రాయంమీాదా ప్రజల యొక్కా ప్రభుత్వంయొక్కా సత్తువలమీాదా ఆధారపడి ఉంటుంది" అన్నారు.

ఈ ప్రాథమిక స్వత్వసిద్ధాంతంమీాదకు దాడిచెడలేవారు ప్రయోగించే మరొక అస్త్రం—ఈ సిద్ధాంతమును చేర్చడంవల్ల రాజ్యాంగశాసనాలు ప్రాతధోరణిలో పడతాయి అనీ, అది మితవాదశక్తులకు దోహదం చేస్తుంది అనీ, సంఘంలో ప్రత్యేక సౌకర్యాలను అనుభవించే వారికి అది రక్షగా ఉపయోగపడు తుంది అనీ వారుచేసేవాదం ఈ ప్రశ్న ఈ సిద్ధాంతమునకు స్వాభావికమ్మైన రెండులక్షణాలవలన బయలుదేరింది ఒకటి: ఏకాలంలోనైనా రాజ్యాంగశాసనంలో చేర్చడానికి ఈ హక్కుల జాబితా వ్రాయవలసివచ్చినప్పుడల్లా, ఆకాలపు ప్రజలయొక్క ఆశయాలనూ, అనుభవాలనూ అనుసరించే వాటిని వ్రాయవలసి ఉంది. రెండవది : ఈ ప్రాథమికస్వత్వాలతోకూడిన రాజ్యాంగ శాసనాలన్నీ చాలా కఠినమైనవిగా తయారయి సవరించడానికి కూడా వీలులేకుండా ఉన్నాయి. ఈ రెండుకారణాలవల్లా పైనచెప్పిన ప్రమాదం వాస్తవమైనదే అని వారివాదం

ఈవిమర్శనావిధానం చాలా శక్తిమంతమైనది. సంయుక్త రాష్ట్రాలలో ఉన్నత న్యాయస్థానంవారు రాజ్యాంగశాసనానికి చేసిన వివిధవ్యాఖ్యానాలచరిత్ర ఈ వాదానికి మంచిబలాన్ని చేకూర్చింది. ఆదేశం వ్యావసాయికమైనదిగానూ, తక్కువ జనాభా కలదిగానూ ఉన్నప్పుడు — అంటే 18 వ శతాబ్దంలో పవిత్రములుగా భావింపబడిన హక్కులు, దేశం పారిశ్రామి కంగా ఎంతో అభివృద్ధిచెంది, జనాభా పెరిగి 10 కోట్లకుకూడా మించిన ఈ రోజులలోకూడా — పవిత్రములుగానే పరిగణింప బడుతున్నాయి. 18 వ శతాబ్దపునాటి హక్కులను అతిక్ర మించి తాము ఏమీాచేయకూడదనే భావంతోనే న్యాయాధి

పతులు పనిచేయవలసివస్తుంది. కాని ఆ హక్కులు పారిశ్రామికంగానూ, ఆర్థికంగానూ ఎక్కువ పలుకుబడిగల ధనికవర్గాల ఆస్తులనూ ప్రత్యేక సౌకర్యాలనూ సంరక్షించేవిగా ఉన్నాయి పైగా అవి ప్రజాసామాన్యంయొక్క హక్కులకూ, స్వేచ్ఛకూ ప్రతికూలములుగా కూడా ఉన్నాయి ప్రజాసామాన్యానికి సంబంధించిన హక్కులకు ప్రభుత్వవర్గాలవలన సంభవించే ప్రమాదంకంటే నిజానికి ఈ ధనికవర్గములవలన కలిగే ప్రమాదమే ఎక్కువది సాధారణశాసనాలతో కార్మికుల హక్కులను కాపాడటానికి ప్రభుత్వంచేసే ప్రయత్నాలన్నీ-అవి రాజ్యాంగశాసన విరుద్ధము లని న్యాయస్థానాలు తీర్పుచెప్పి కొట్టివేస్తూ ఉండటంవలన నిష్ఫలము లయిపోయినాయి ఒక అభ్యుదయకరమైన ఆర్థిక సాంఘికవిధానం కనుగొనడం దుస్సాధ్యమైంది.

ఇట్టి ఇతర సన్నివేశాలలో వలెనే ఈ ప్రశ్న-స్థిరశాంతిని కోరే వాదానికీ అభ్యుదయవాదానికీ, అలాగే అధికసంఖ్యాక స్వత్వాలకూ అల్పసంఖ్యాక స్వత్వాలకూ జరిగే సంఘర్షణలో వాటి గుణాగుణవిమర్శనకు సంబంధించినది వీటన్నింటి నడుమా సామరస్యం ఉండటం ఆరోగ్యవంతమైన సమాజానికి లక్షణం. కాని సంయుక్తరాష్ట్రాలలో సంభవించినదీ ఆ సంయుక్త రాష్ట్రాలను అనుకరించి తమ రాజ్యాంగశాసనాలను తయారు చేసుకొన్న ఇతర దేశాలలో సంభవింపనున్నదీ ఏమిటంటే - స్తిమితస్థితి ఏర్పడటానికీ అల్పసంఖ్యాకుల హక్కులను కాపాడటానికీ అధికసంఖ్యాకవర్గమూ, అభ్యుదయవాదమూ చేయవలసిన త్యాగం చాలా ఎక్కువ అవుతూఉండటం. కాని సంయుక్తరాష్ట్రాలలో అక్కడక్కడ జరిగినట్లు న్యాయస్థానాలు

రాజ్యాంగశాసనాన్ని కొంచెం ఉదారంగా వ్యాఖ్యానిస్తే కొంత అభివృద్ధి సాధ్యం అవుతుంది అల్పసంఖ్యాకవర్గమైన ధనికవర్గం ఇతోధికమైన న్యాయబుద్ధితో అధికసంఖ్యాకుల న్యాయమైన హక్కులను ఆమోదిస్తే ఇంకా ఎక్కువ ఫలితాన్ని సాధించవచ్చును రాజ్యాంగశాసనాన్ని సవరించడానికి కాలదోషముపట్టి నిరుపయోగములై పోయిన హక్కులను దానిలోనుంచి తగ్గించివేయడానికీ నూతన యుగానికి అవసరములైన క్రొత్తహక్కులను చేర్చడానికీ హక్కులజాబితాను సాధ్యమయినంతలో సంగ్రహంగా చేయడానికే సూచింపదగిన ఇతరసాధనాలు ఇంతకంటె సులభసాధ్య విధానాలుగా ఉన్నాయి.

సాధారణ శాసనాలు రాజ్యాంగశాసనబద్ధములై ఉన్నవా లేవా అని తేల్చవలసి వచ్చినప్పుడు న్యాయాధిపతులు చెలాయించ గలుగుతూఉన్న విశేషమైన శాసనాధికారానికి కూడా ఈ ప్రాథమికస్వత్వమే కారణం. శాసనసభలు చేసిన శాసనాన్ని త్రోసిరాజనడానికి వారికి సమర్థమైన ప్రత్యేకాధికారం (Veto) ఉంది ఒక రచయిత అన్నట్లు వారు తృతీయ శాసనసభగా వ్యవహరిస్తున్నారు ఈ విషయమును గురించిన వివరములన్నింటినీ ఇచ్చట చర్చించడం అనవసరం ప్రాథమిక స్వత్వాలను సక్రమంగా అమలు జరపడానికి చేసిన ప్రయత్నాలకు ఇది ఒక ఫలితము అని మనం గుర్తిస్తే చాలును.

ఈ సిద్ధాంతంలో ఎన్నిలోటుపాట్లు ఉన్నా, వాటివలన ఎన్నికష్టాలు కలుగుతున్నా ఆచరణలో ఇది – ప్రభుత్వాధికారులు తమ అధికారాన్ని దుర్వినియోగం చేయకుండా అరి

కట్టడంలోనూ, పాలితులైన ప్రజలయెడల వారు నిర్వర్తింప గలసిన విధులను వారికి నిరంతరం జ్ఞాపకం ఉండేటట్లు చేయ గల సాధనంగానూ చాలా ప్రయోజనకరమైన ఫలితాలను సాధించినట్లు ఈ ప్రాథమికస్వత్వ సిద్ధాంతముయొక్క గుణా గుణ విమర్శనవలన తెలినది అనవచ్చును ఈ సిద్ధాంతం తేలి కగా పరిత్యజింపబడటం అసంభవము అనే చెప్పవచ్చును ప్రజాస్వామికపద్ధతిపైన ఆధారపడిఉన్న ప్రతిప్రభుత్వవిధానం లోనూ దీనికి ప్రముఖస్థానండుంటూ నేడుంటుంది. ప్రజాస్వామిక పద్ధతి విస్తరిల్లిన కొలదీ దీని ప్రభావంకూడా విశాలంఅవుతుంది.

---

## నవమాధ్యాయము

# భారతదేశంలో ప్రాథమికస్వత్వ వాంఛ

ఈ మధ్య కొన్ని సంవత్సరాలనుండి, భారతదేశంకోసం ఏర్పాటుచేయబడే ఏ రాజ్యాంగశాసనంలోనైనానరే ప్రాథ మికస్వత్వాలను చేర్చాలి అనే కోరిక ఈ దేశంలో వెల్లడింప బడుతూంది. పాశ్చాత్యదేశాలలో ఈ వాంఛ కలగడానికి కారణములైన పరిస్థితులకూ భారతదేశములో గల పరిస్థితు లకూ కొన్ని చిన్నవిషయాలలో స్వల్పభేదములు ఉన్నా, సాధారణ విషయాలలో చాలా సన్నిహితములైన పోలికలు ఉన్నాయి. 'మాకివరు' చెప్పినట్లు ప్రభుత్వ విధానాలన్నీ ఐతే ప్రజాస్వామికములు గానో, లేకపోతే నిరంకుశాలు గానో మాత్రమే ఉంటాయి అని అంగీకరిస్తే బ్రిటిషు ప్రభుత్వము

వారిచేత భారత దేశంలో ఏర్పాటుచేయబడిన ప్రభుత్వపద్ధతి నిరంకుశవిధానపు జాబితాలోకే ఎక్కుతుంది. తన క్షేమ లాభాలకోసం అది ప్రజలయొక్క వ్యక్తి వాక్ సమావేశాది పౌరస్వాతంత్ర్యాలను అనేక నిర్బంధాలకు గురిచేయవలసి వస్తూంది. విప్లవయుగానికి పూర్వం యూరపులోనూ సరీగా ఇలాంటినిర్బంధాలే విధించబడ్డాయి. దేశంలో జాతీయోద్యమం వృద్ధిఅయినకొద్దీ గడచిన కొలది సంవత్సరాలలోనూ ఈనిర్బంధాలు మరీ దుర్భరాలుగా చేయబడ్డాయి ఈసందర్భంలో మనం జ్ఞాపకం ఉంచుకోనవలసిన మరొక విషయం: యూరపులో విప్లవ నాయకులుగా 17, 18 శతాబ్దాలలో తయారయి ప్రాముఖ్యములోనికి వచ్చిన తరగతులలాగే ఇక్కడా ఒక శక్తిమంతమైన మధ్యతరగతీ, బుద్ధిమంతులతరగతీ తల ఎత్తినాయి. వీరు స్వాతంత్ర్యమూ, సమానత్వమూ, పాలితుల అనుమతితో ఏర్పడే ప్రభుత్వవిధానమూ మొదలైన పాశ్చాత్యుల ఉదారాశయాలకు ఉత్తేజితులయారు ప్రభుత్వము పౌర స్వాతంత్ర్యాన్ని అరికట్టేనిర్బంధాలను విధించడమూ, దేశంలో యూరపియనులకూ ఆంగ్లోఇండియను జాతివారికీ ఉచ్చస్థితిని కలిపించి దేశీయులను నీచంగా చూడడమూ, ఈ మధ్యతరగతివారికి చాలా కోపకారణాలు అయాయి. దీనికి అంతటికీ ఫలితంగా బుద్ధిమంతులందరూ ప్రాథమికస్వత్వ సిద్ధాంత ప్రాముఖ్యాన్ని గుర్తించారు. వారు తయారుచేసిన, లేక వారి ఆధిపత్యమున తయారుచేయించిన— 1928 లో అఖిలపక్ష మహాసభచే తయారుచేయబడిన దానివంటి— రాజ్యాంగ శాసనాలన్నింటిలోనూ ప్రాథమికస్వత్వాలకు ప్రముఖస్థానం ఇచ్చారు.

పైగా ఈ విషయానికి మరింత ప్రాముఖ్యాన్ని ఇవ్వడానికి భారతదేశ పరిస్థితియొక్క మరిరెండు విలక్షణ స్వభావాలుకూడా బలవత్తర కారణా లయినాయి, అయితే ఇలాంటి పరిస్థితులు ఇతరదేశాలలో ఇదివరకు సంభవించకపోలేదు. వీటిలో ఒకటి వర్ణవ్యవస్థ, రెండవది అల్పసంఖ్యాక సంఘాల సమస్య.

భారత సాంఘిక నిర్మాణంలో వర్ణవ్యవస్థకు గల విశేష ప్రాముఖ్యమును గురించి వేరే వివరణ అవసరమే లేదు. జన్మను బట్టి వంశపరంపరానుగతములైన తరగతులుగా అది విభజింపబడిఉంది కొన్ని తరగతులవారు ప్రత్యేకాధిక్యతను అనుభవించడమూ, మరికొందరు అనేక నిషేధాలకు గురికావడమూ జరుగుతూంది. ఇది సర్వసమానత్వ సిద్ధాంతానికి విరుద్ధం ఈ వ్యవస్థలో — గ్రామాలకు దూరంగా నెట్టివేయబడి గ్రామస్థుల పాఠశాలలలోనికిగాని, వీధులలోనికిగాని, జలాశయాల వద్దకుగాని ప్రవేశం నిషేధింపబడిన అస్పృశ్యులయొక్క, ఇతర నిమ్నజాతులయొక్క పరిస్థితి మరీ దారుణంగాఉంది. ఆధునికయుగంలో వర్ణవ్యవస్థపైన తిరుగుబాటు రేగినమాట వాస్తవం. ఆంగ్లభాషాప్రాచుర్యమూ, దేశంలో పరిశ్రమల వ్యాప్తీ, రాజకీయ జాతీయభావాభ్యుదయమూ, పాశ్చాత్య దేశాలనుండి వచ్చిన వ్యక్తిస్వాతంత్ర్యభావాలు — ఇవన్నీ వర్ణవ్యవస్థయొక్క పట్టును సడలించడానికి బాగా ఉపయోగపడ్డాయి. నేటికి ఇంకా వర్ణాలు వున్నాయి గాని, కొందరు యెక్కువ, కొందరు తక్కువ అనే భావాలకు పూర్వము వున్న బలం సడలిపోయింది. అయినప్పటికీ సంఘ

మంతా వివిధవర్ణాలుగా విభజింపబడివుండటం ఇంకా తొలగి
పోలేదు. ఒకతరానికిపూర్వం కొద్దికాలంలో వర్ణవ్యవస్థ అనేది
లేకుండాపోతుంది అనిపించిందిగాని, దురదృష్టవశాత్తు కొన్ని
నూతనభావాలు బయలుదేరి, మళ్ళీ దానిజీవితాన్ని పొడిగించ
డానికి ప్రయత్నిస్తున్నాయి. వీటిలో ముఖ్యమైనది, బలవత్తర
మైనదీ, బ్రిటీషు ప్రభుత్వమే ఈ వర్ణవ్యవస్థను గౌరవించడం.
సైన్యములోనికీ, ఇతర ఉద్యోగాలకూ అభ్యర్థులను ఎన్నుకొన
డంలో వర్ణవ్యవస్థకు ప్రాధాన్యం ఈయబడింది. ఈ సందర్భ
ములో కొన్నివర్ణాలవారిని తక్కినవారికంటే ఎక్కువఅర్హులని
నిర్ణయించారు. దీనివలన ప్రత్యేకార్హతలను పొందిన వర్ణాల
వారు వర్ణవ్యవస్థను సజీవంగావుంచి, విడివిడిగా వుండటానికి
ఉత్సహిస్తున్నారు న్యాయస్థానాలు, పాఠశాలలూ, ప్రభుత్వ
కచేరీలూ మొదలైన అన్నిశాఖలలోనూ వ్యక్తుల కులవివక్షను
గూర్చిన విచారణే ప్రాధాన్యం వహించడం దీనివలన గలిగిన
ముఖ్యఫలితం దీనితో తమకులాన్ని మరచిపోవడానికి ప్రయత్ని
స్తూన్న వారికిగూడా మళ్ళీబలవంతాన దాన్ని జ్ఞాపకంచేయడం
అవుతూంది. 1919 నుంచి దేశములో ప్రవేశపెట్టబడిన రాజకీయ
సంస్కరణలన్నింటిలోనూ, కులాలవారి ప్రాతినిధ్యానికీ కొన్ని
సందర్భాలలో ప్రత్యేక కులనియోజక వర్గాలకూ కూడా అవ
కాశం కలిగించారు. ఇది మళ్ళీ కులవివక్షతలు బలపడడానికి
దారితీసింది. అధికారంకోసం జరిగే సంఘర్షణలలో స్వార్థపరు
లయిన రాజకీయవాదులు తమ వ్యక్తిగత ప్రయోజనాలకోసం
కులసంఘాలను స్థాపించారు ఒకానొక ప్రత్యేక కులానికి
చెందినవారికి మాత్రమే ప్రవేశార్హతను ఇచ్చే పాఠశాలలూ,

భోజనవసతిగృహాలూ, పరపతి సంఘాలూ, ఇలాంటి సంస్థ లెన్నో విద్యార్థిసులైనవారిచేతనే స్థాపించబడుతున్నాయి. దీనికి ఫలితంగా వర్ణవ్యవస్థ అలాగే నిలచివుంటూంది. ఒక వ్యక్తి యొక్క నిజమైన శక్తిని గ్రహించడం మానివేసి అతడు ఏ కులానికి చెందినవాడో దానినిబట్టి అతని విలువను నిర్ణయిస్తూ న్నారు. ఒక నూతన కులతత్వభావం ప్రచారం కావడమూ, దానికి ఫలితంగా (పూర్వం ఒకప్పుడు) అగ్రవర్ణస్థులుగా పిలువ బడినవారు తమపూర్వుల అపరాధాలకు శిక్షగా ఇప్పుడు అణగ ద్రొక్కబడటమూ జరుగుతూంది. ఈ సందర్భములో సోవి యట్ సమాఖ్యలో పెట్టుబడిదారులయెడలా, కులక్కుల (Kulaks) యెడలా కమ్యూనిస్టులూ, శ్రామికవర్గాలవారూ, అవలంబించిన విధానం జ్ఞాపకం వస్తున్నది.

ఈ కులతత్వపూరితమైన వాతావరణంలో మానవుడు కేవలం మానవుడు అయినందుకే అతనిహక్కులు లభింపజేయు డమూ, ఒకవ్యక్తి ఒకకులానికి చెందినవాడు అవటం వలన అతనికి ఏ విధమైన అనర్హతను ఆపాదించక పోవడమూ, ఈ దేశంలో యేర్పడబోయే ఏ రాజ్యాంగ విధానానికైనా సర్వ జనసమానత్వసూత్రాన్ని ఆధారంగాచేయడమూ చాలా అవస రంగా కనిపిస్తున్నాయి. అఖిలపక్షసమావేశంలో తయారుచేసిన రాజ్యాంగవిధానం ఈ విధమైన దృక్పథముయొక్క ఆవశ్యక తను గుర్తించి తమ హక్కుల ప్రకటనపత్రంలో ఎన్నో నిబం ధనలను—ముఖ్యంగా నిమ్నజాతులవారు ప్రస్తుతం అనుభవిస్తూ వున్న బహిష్కారాలను తొలగించే ఉద్దేశంతో,—చేర్చారు. ఇతర కులాలవారిమీద క్రొత్తగా మరికొన్నినిషేధాలు విధింప

బడకుండా చూడడం కూడా చాలా అవసరం అని చెప్పవల సిన స్థితికికూడా ఇప్పుడు మనం వచ్చాం

ఇలాంటి భావాలతోనే హిందూ మహాసభవారు 1935 భారతశాసనంలో ఈ క్రింది ప్రాథమికస్వత్వాలను చేర్చా లని పట్టుపట్టారు

1. పౌరస్వత్వాల విషయములోనూ, ఆర్థిక స్వత్వముల విషయములోనూ, ఏ వ్యక్తికీ అతని కులముగాని, మతముగాని కారణంగా భూమిసంబంధమైన ఆస్తిని ఏవిధమైన నిషేధాలూ లేకుండా అతడు బహిరంగంగా అనుభవించడానికి, కొనడానికీ, అమ్మడానికీ, తనకిష్టమైన వృత్తిని తాను చేసుకొనడానికీ, ఇంకా ఇలాంటి హక్కులకూ ఏవిధమైన అనర్హతలనూ కలిపించ కూడదు ప్రస్తుతం హిందూదేశంలో ఉన్న కులవివక్షతలమీాద ఆధారపడినటువంటివన్నీ ఈ హక్కులను అందరూ సమానంగా అనుభవించడానికి ఆటంకంగా ఉన్నటువంటివన్నీ శాసనాలన్నీ ఇందుమూలంగా ఇప్పుడే రద్దయిపోవాలి.

2. ఏవ్యక్తీ అతనిమతముగాని, కులముగాని, కారణంగా ప్రభుత్వోద్యోగాలలో ఏ శాఖలోనికిగాని ఎన్నుకొనబడుటకు అనర్హుడుగా పరిగణింపబడకూడదు.

3. ఒక కులములోగాని, మతములోగాని, సంఘములో గాని సభ్యుడై ఉన్నంతమాత్రంచేత అతనిని ప్రభుత్వము యొక్క, ఇతర ప్రజాసంస్థలయొక్క ఉద్యోగాలలో చేర్చు కొనడానికిగాని, అతని ఉద్యోగాభివృద్ధికి అభ్యంతరంగాని ఉండకూడదు.

భారతదేశ పరిస్థితియొక్క రెండవ లక్షణం దేశంలో మతాలకూ, భాషలకూ సంబంధించిన అనేక అల్పసంఖ్యాక వర్గాలు ఉండటం. వీటిలో మహమ్మదీయవర్గం మిక్కిలి ప్రధాన మయినది వారు బాగా స్వసంఘసంఘటనను చేసుకొన్నవారు కూడాను. అందువలన భవిష్యత్తులో భారతదేశము కొరకు తయారుచేయబడే యేరాజ్యాంగశాసనంలోనైనా వారి విజ్ఞానానికీ ఇతర సౌకర్యాలకూ రక్షణ కలిపించవలసిన ప్రముఖఆవశ్యకతే భారతదేశంలో అల్పసంఖ్యాక ప్రాథమిక స్వత్వాలకు విశేషప్రాముఖ్యమును కలుగజేసింది. పంజాబులోని సిక్కులూ, దేశమంతటా ఉన్న క్రైస్తవులూ, — ఇతర మతవిషయిక అల్పసంఖ్యాకులూ, — ఈ అల్పసంఖ్యాక వర్గాలు ఉండటంవలన ఏర్పడుతూఉన్న సమస్య మధ్య, తూర్పుయూరపునందలి కొన్ని రాజ్యాలలోని అల్పసంఖ్యాక సమస్య వంటిది. ఈ సందర్భాన్ని గురించి వివరిస్తూ అఖిలపక్ష మహాసభ నివేదికలో ఇలా వ్రాశారు. "హక్కుల ప్రకటనను అత్యంత ముఖ్యమయిన దానినిగా చేసిన మరొక విషయము ఏమిటంటే దురదృష్టవశాత్తూ దేశంలో మతవిభేదాలు ఉండటం పరస్పరము అవిశ్వాసముతోనూ, అనుమానాలతోనూ చూచుకొనుచున్నవారికి రక్షణనూ, అనుమాన నివారకమైన భద్రభావాన్నీ కలిగించడానికి కొన్ని హామీలూ, వాగ్దానాలూ అవసరం. మతవిషయికమయినటువంటివన్నీ, కులాలకు సంబంధించి నటువంటివన్నీ హక్కులను పూర్తిగా అనుభవింపజేయడానికి, వాటిని రాజ్యాంగ శాసనముయొక్క ప్రధాన సూత్రాలలో చేర్చడానికంటె ఉత్తమసాధనం మరొకటిలేదు.

దేశమందలి మహమ్మదీయులలో ఎక్కువమంది తామొక ప్రత్యేకజాతికి చెందినవారము అనీ, కేవల అల్పసంఖ్యాకవర్గమాత్రులు కారనీ, ప్రత్యేకజాతిగా తాము స్వయం నిర్ణయాధికార యోగ్యతనూ, భారతదేశములో ఈశాన్య వాయవ్యప్రాంతాలలో ప్రత్యేకరాజ్యాలను స్థాపించుకొనే హక్కూనూ కలిగి ఉన్నామనీ చేస్తూన్న వాదం పైనచెప్పిన అఖిలపక్ష సభానిర్ణయాన్ని ఏవిధంగానూ భంగించదు. ఎందుకంటే, అలాంటి ప్రత్యేక రాజ్యాలు ఏర్పాటుఅయినా దేశంలో అల్పసంఖ్యాక సమస్య ఉండనే ఉంటుంది. క్రొత్తగా ఏర్పడిన రాష్ట్రాలలో బహుసంఖ్యాకులైన మహమ్మదీయులతోపాటు సిక్కులూ, హిందువులూ, క్రైస్తవులూ అల్పసంఖ్యాకులుగా ఉంటారు. చాలామంది విమర్శకులు చెప్పినట్లు, కేవలం పాకిస్థాను సృష్టి అల్పసంఖ్యాకసమస్యను పరిష్కరింపలేదు కట్టుదిట్టమైన రాజ్యాంగశాసనంలో హక్కుల ప్రకటననుకూడా చేర్చి వారి విజ్ఞానసౌకర్యాలకు రక్షణ కలిపించవలసిన ఆవశ్యకత అప్పుడూ వుంటుంది. ఈ విషయాన్నిగూర్చి 1933 లో భారత జాతీయ కాంగ్రెసు మహాసభ చేసిన తీర్మానమును ప్రస్తుత విషయానికి ఉదాహరణగా తీసుకొనవచ్చును.

ఈ సిద్ధాంత చరిత్రను వివరించేటప్పుడు ఇది తన రెండవ దశలో చాలామార్పు చేయబడినదనీ, ప్రభుత్వం కార్యాచరణకు పూనుకోవాలని కోరే చాలాహక్కులు దానిలో చేర్చబడినాయి అనీ ఇదివరలో చెప్పాము. 1933 లో ఇంగ్లండులో భారతప్రభుత్వ శాసనాన్నిగురించి చర్చించేటప్పుడు సంయుక్త పార్లమెంటరీ ఉపసంఘము (Joint Parliamentary Com-

mittee) వారి యెదుట చాలా సంఘాలవారిచే నివేదింపబడిన హక్కుల వాంఛలో కూడా ఈవిషయం గోచరిస్తూంది. ఉదాహరణకు, మహిళా సంఘాలవారు. "సమానత్వ సిద్ధాంతమును ఆమోదించి, దానికి రాజ్యాంగ శాసనంలోని పౌరప్రాథమిక స్వత్వప్రకటనలో స్పష్టమైన స్థానమును ఈయవలెను" అని కోరారు. జాతీయ కార్మికసమాఖ్యవారు కార్మికులకు పనినీ, వార్ధక్యపు భృతినీ, అవిటివారైన వారికి సహాయాన్నీ ప్రసాదించే హక్కులకు హామీ ఇస్తూ ప్రకటన చేయాలనికోరారు. సంగరాష్ట్ర కార్మికసమాఖ్యవారు, "వ్యావసాయిక వృత్తిగల రైతులలోనుంచే పారిశ్రామిక కూలీలు తీసుకొనబడుతున్నారు. గనుక, వారికి యుక్తమైన మకానాను, నిర్ణీతమైన యితర వసతులనూ ఏర్పరచాలి అనీ, ఆరోగ్యరక్షణకూ, శ్రామికార్థతకూ, గర్భవతులయిన కూలీలకు ప్రత్యేకరక్షణకూ, వారిబిడ్డల పోషణకూ, వార్ధక్యనిరాధారతానివారణకూ, అస్థిరత్వమునుండీ, నిరుద్యోగమునుండీ రక్షణకూ, ప్రత్యేకంగా హామీ యిస్తూ ప్రకటన చేయాలిఅనీ కోరారు. పైన ప్రస్తావించిన కాంగ్రెసు తీర్మానంలోకూడా కార్మికుల ప్రత్యేకస్వత్వములను చేర్చి ఆర్థిక సాంఘిక ప్రణాళికను తయారుచేశారు.

ఆచార్యబార్కరు చెప్పినట్లు "చిరకాలం 'టాం పెయిన్'గారి అతివాదతత్వంతో ముడిపెట్టుకొని ఉండిన ఈ ప్రకృతిసిద్ధమైన స్వత్వసిద్ధాంతం క్రమంగా ఆదిలో దీనిని చూచి ఆందోళనచెందిన మితవాదులకే ఆశ్రయమైనదని వినగానే మొదట చాలా ఆశ్చర్యం కలుగుతుంది." కేవలం రైతులయొక్క క్షేమానికే కాక దేశీయులందరికీ ఉపయో

గించేది గనుక 'స్థిరసిస్తునిర్ణయం' (Permanent Revenue Settlement) లో చాలా సవరణలు జరుగవలసి ఉన్నట్టు సర్వత్రా అందరూ అంగీకరిస్తూనేఉన్నా భూస్వాముల సంఘాల వారు చాలమంది తమ ఆస్తిపాస్తుల రక్షణకు హామీఇస్తూ ఒక ప్రాథమిక స్వత్వ పత్రాన్ని ప్రకటించవలసిందిగా సంయుక్త పార్లమెంటరీ ఉపసంఘము వారికి నివేదికలను పంపించారు ఇది బార్కరు చెప్పినదానికి ఉదాహరణగా తీసుకొనదగినది ఒరిస్సా భూస్వాముల సంఘంలవారు పంపిన నివేదికలోకూడా "కనీసం బ్రిటిషు వారికి చెందిన భారత దేశంలోనైనా అమలు జరిపే ఉద్దేశంతో సమూఖ్యయొక్క ప్రజాపౌరప్రాథమికస్వత్వాలను రాజ్యాంగశాసనంలోచేర్చాలి. అలాంటి హక్కులలో భూస్వాముల సౌకర్యాల రక్షణకొరకు కూడా కొన్ని హక్కులను చేర్చాలి. లేదా స్థిరనిర్ణయాన్ని (Permanent Revenue Settlement) ఏ సందర్భంలోనూ మార్చము అని ఒక ప్రకటననైనా చేర్చాలి" అనికోరారు. మొదటినుంచీకూడా వెవరైన ప్రాథమిక స్వత్వాలను కోర డానికి భయమో, ఆశో మాత్రమే కారణాలుగా ఉంటు న్నాయి. భయం—స్థాపన కాబోయే ప్రభుత్వం ఆ హక్కులలో జోక్యంకలిగించుకుంటుందేమోననీ, ఆశ — అవి సాంఘికాభ్యు దయానికీ ఉపయోగపడతాయనీ బ్రిటిషుప్రభుత్వము వారి నుండి అధికారం దేశప్రజల హస్తగతం కాగానే భూస్వాములు ఇంతవరకూ అనుభవిస్తూ ఉండిన సౌకర్యాలు మాయం కావచ్చును అనే భయమే చాలా ప్రాంతాలనుంచి భూస్వాము లందరూ ఇలాంటి కోరికలు కోరడానికి హేతువు. ఇలాటి

కోరికలను గౌరవిస్తే అసలు ఈ సిద్ధాంతమునే దురుపయోగం చేసినట్టు అవుతుంది ఈ సిద్ధాంతము యొక్క ప్రధానఆశయం ప్రత్యేక సౌకర్యాలకు నాశనం చేయడమేగాని వాటికి రక్షణ నీయడంకాదు ప్రత్యేకసౌకర్యం ఒక ప్రాథమిక స్వత్వంకాదు

ఇలా చేసినవారు భూస్వాములొక్కరే కారు. భారత దేశంలో స్థిరనివాసమేర్పరుచుకొన్న బ్రిటిషువ్యాపారులందరూ తమ సౌకర్యాలకు ప్రత్యేకరక్షణను కోరారు ప్రభుత్వో ద్యోగాలలో ఉన్నవారు "ఈ శాసనంలో తమకు ఏర్పాటు చేయబడిన హక్కులు" కు మాత్రమేకాక న్యాయసమ్మతము లైన తమ సర్వసౌకర్యాలకూ కూడా రక్షణ కావాలంటూ, స్పష్టంగా కోరారు చివరకు జరిగినదికూడా అంతే అయింది. 1935 ఇండియా చట్టంలో, 18, 19 శతాబ్దాల రాజ్యాంగశాస నాలన్నింటిలోనూ ఉన్న సాంప్రదాయసిద్ధమైన హక్కులనుగాని కార్మికసంఘాలవారుకోరిన హక్కులనుగాని, చేర్చకపోయినా, ప్రత్యేక సౌకర్యాలను (Vested Interests) అనుభవించేవారి హక్కులకు మాత్రం స్థానం కలిపించబడింది. ఇలా జరగడానికి కారణాలు కొంతవరకూ అనిర్దిష్ట స్వత్వాల ప్రయోజనాన్ని గురించి బ్రిటీషు రాజకీయవేత్తలకుగల అనుమానాలూ, అంత కన్న ఎక్కువగా దానిని తయారుచేసినవారు శాసనముయొక్క ఫలితాన్ని ముఖ్యంగా అనుభవించవలసిన ప్రజలయొక్క ప్రతి నిధులు కాకపోవడము.

1935 ఇండియాచట్ట నిర్మాణానికి బాధ్యులైన పెద్దలు ఒక సంపూర్ణమైన ప్రాథమికస్వత్వాల జాబితాను ఆ చట్టంలో

చేర్చక పోవడానికి చాలా కారణములు చెపుతూ ఇలా వాదించారు

1 సర్ శామ్యూల్ హోరు దానిని(ప్రాథమికస్వత్వాన్ని) ఒక న్యాయసమ్మతమైన నిర్ణయానికి ఒదిగేటంత స్పష్టంగా తయారుచేయడం అతికష్టసాధ్యమైన పని న్యాయనిర్ణయానికి ఒనరని ప్రాథమికస్వత్వం కేవలం ఒక ఆధ్యాత్మిక ధర్మ ప్రకటనము మాత్రమే అవుతుంది'' అన్నారు.

అలా అనడంలో సైమన్ కమీషన్ వారి రిపోర్టులో వ్రాసిన అభిప్రాయాన్నే ఆయన మళ్లీ పునశ్చరణ చేసినట్లయింది ఆ రిపోర్టులో ఇలావుంది :-

"చాలా రాజ్యాంగశాసనాలలో ముఖ్యంగా యుద్ధానంతరం తయారైన యూరపురాజ్యాల రాజ్యాంగశాసనాలలో ఇలాంటి ఏర్పాట్లు చేయబడినాయని మాకు తెలుసు. కాని ఆ ఏర్పాట్లు ఏమంత ప్రయోజనకరములైనవి కావని అనుభవం వలన తేలుతున్నాయి అనిర్దిష్ట ప్రకటనలు వాటిని శక్తిమంతములుగా చేయగల సంకల్పమూ సాధనమూ ఉంటేనేతప్ప - నిరుపయోగకరములు."

2. వాటికి తగినంత స్పష్టమైన ఆకారం కలిపించడానికి అవకాశం ఉన్నా, రాజ్యాంగశాసనాలలో వాటిని చేర్చడం అంతులేని న్యాయస్థానవివాదాలకు దారితీస్తుంది. సైమన్ కమీషను వారి రిపోర్టులో ఈ విషయాన్నే ఇలా చెప్పారు:-

"భారత దేశ న్యాయస్థానాల్లో జరుగుతూన్న ఎడతెగనటువంటివీన్నీ, అక్రమపద్ధతులతో కూడుకొన్నటువంటివీన్నీ వివాదలను దృష్టిలో ఉంచుకొనిచూస్తే ఈ పనివలన న్యాయ

స్థానాలు తేలికగా తీర్చలేని వివాదాలను వాటికి వప్పగించి నట్లు అనవచ్చు నని మనం తెలుసుకొన గలుగుతాం. గట్టి ఉపపత్తులతో బలమైన ఆధారాలుగల అభియోగాలను పరిష్కరించే న్యాయస్థానం నిజంగా ఏమీా ఆధారంలేని తికమక అభియోగాలనుకూడా విచారించక తప్పదు అన్నసంగతిని ఎప్పుడూ జ్ఞాపకం ఉంచుకోవాలి."

(నిజానికి నాయస్థానవివాదాభిలాష అనే దురభ్యాసం ఒక్క భారతదేశానికి మాత్రమే స్వభావసిద్ధమైనది కాదు అనీ ఈ వివాదల దృష్టిలో హక్కులు రాజ్యాంగ శాసనంలోఉన్నా సాధారణ న్యాయశాసనాలలో ఉన్నా పెద్ద తేడా ఏమీా లేదనీ తెలుసుకోవాలి.)

3 హక్కులపత్రం ఎలాంటిది అయినా "అది శాసన సభల అధికారాలకు తీవ్రమైన నిరోధాలను కలిపించి దేశానికి అవి అత్యవసరములైన అభ్యుదయకరములైన పనులనుకూడా చేయుడానికి వీలులేకుండా చేస్తుంది"

4. అల్పసంఖ్యాకులయొక్కా ప్రజలలోని ఇతర విలక్షణ సంఘాలయొక్కా హక్కులను రక్షించడానికి ఇంతకంటె మంచి మార్గం ఉంది.

1858లో విక్టోరియారాణి చేసిన ప్రసిద్ధప్రకటనలాంటి రాజప్రకటనద్వారా నూతన రాజ్యాంగశాసన ప్రారంభోత్సవ సమయంలోగాని, చక్రవర్తి రాజప్రతినిధికీ, రాష్ట్రగవర్నర్లకూ పంపే సూచన పత్రిక (Instrument of Instructions) ద్వారాగాని ఈపని జరుగవచ్చు. భూమి హక్కుల విషయంలో (1935 ఇండియాచట్టం వాస్తవంగానే జరిగినవిధంగా)- కొన్ని

సందర్భాల్లో పూర్వమే ఆమోదింపబడిఉన్న హక్కులలో జోక్యం కల ఏవిధమైన శాసనాన్నిగాని చేయడానికి ప్రయత్నం చేసేటప్పుడు, ఆ సందర్భాన్ని అనుసరించి రాజప్రతినిధియొక్క గాని, గవర్నరుయొక్కగాని అనుమతిని ముందుగా పొందకుండా ఏమీ చేయకూడదు అనే నియమాన్ని ఏర్పాటు చేయవచ్చును.

(ఈ వాక్యములోని పొరపాటు ఏమిటంటే- ఇలాంటి ప్రకటనలు ఆచరణలో ఏమంత ప్రయోజనకారులుగా లేక పోవడమూ, అసలు ఈ సందర్భంలో మనం ఆలోచించే విషయం అసలు ఆ హక్కులే ఏమిటిగా అనేగాని, ఆ హక్కులను సమర్థంగా అనులు జరపడానికి మార్గ మేమిటిగా అని కాక పోవడమూ)

బ్రిటిషు అధికారులు వెల్లడించిన అభిప్రాయాలలో క్రొత్త ఏమీ లేదు. అవి ఈ సిద్ధాంతాన్ని విమర్శించే వారు అందరూ సాధారణంగా చెబుతూన్న వాదాలే. వాటి నన్నింటినీ వెనుకటి అధ్యాయాల్లో పరిశీలించాం ఇక్కడ ప్రత్యేకంగా చెప్పవలసినది ఏమీ లేదు భారతదేశ పరిస్థితిలో బయలుదేరిన ఒకటి రెండు విషయాలను గురించి మాత్రం ఇక్కడ చెప్పాలి.

మొదటి విషయం అధికారులు ప్రాథమికస్వత్వాలను తగినంత విస్పష్టంగా తయారుచేయడానికి అవకాశంలేదు అన్న తమ వాదానికే కట్టుబడి ఊరుకోటంలేదు 1935 ఇండియా చట్టంలో సాంప్రదాయ సిద్ధములైన ప్రాథమికస్వత్వాలనూ, కార్మికవర్గాలవారుకోరే ప్రత్యేక స్వత్వాలనూ చేర్చక పోవ

డానికి అభ్యంతరంగానే వారు పైకారణాలను చెప్పారుగాని, బ్రిటిషు వ్యాపారుల సంఘానికీ, భూస్వాములవంటి అల్ప సంఖ్యాకులకూ, ప్రభుత్వోద్యోగులకూ సంబంధించిన హక్కులను రాజ్యాంగశాసనంలో చేర్చడానికి మాత్రం ఈ కారణం వీరికి ఏమీ అభ్యంతరం కాలేదు. ఈ హక్కులవిషయంలో, ప్రతి సందర్భంలోనూ, హక్కులను సరిగా నిర్వచించడం సాధ్యమే అయినా వాంఛనీయము కాదని తేలింది. ఆ తరగతుల ప్రజలకు కొన్ని న్యాయసమ్మతములైన హక్కులూ, ప్రయోజనాలూ ఉన్నాయని వారు భావించారు, వాటికి రక్షణ కావాలి. సంయుక్త పార్లమెంటరీ ఉపసంఘమువారి ఎదుట సాక్ష్యమిచ్చినవారిలో చాలామంది ఈహక్కులకు ఈ న్యాయ సమ్మతి ఎంతవరకో సరిగా నిర్వచించడము చాలా అవసరమని చెప్పారు. కాని దానిని అలా అస్పష్టంగానే ఉంచేశారు అలాంటి సందర్భంలో ఇలాగే అస్పష్టంగా ఉన్నాయని చెప్పే ఇతర హక్కులనుకూడా చట్టంలో చేర్చినా ఏమీ నష్టంఉండేది కాదు. అలా చేసిఉన్నట్లయితే దేశమంతటి ప్రజాసామాన్యము యొక్క భావాల్లో వాంఛనీయమైన ప్రతిచలనం ఉండేది.

పైనచెప్పిన సంఘాలవారి న్యాయమైన హక్కులను అమలుపరచడానికిగాను తయారుచేసిన పథకాన్ని గురించినది రెండవవిషయం వాటి రక్షణకుగాను గవర్నరు జెనరలుకూ, రాష్ట్రగవర్నరులకూ అవసరములైన సర్వవిధములైన ప్రత్యేకాధికారాలన్నూ ఇచ్చారు. సంయుక్త రాష్ట్రాలలో అమలులో నున్న ప్రకారం హక్కులకు సంరక్షులు న్యాయస్థానాలు అనే ఆచారం దీనివలన భగ్నంచేయబడింది దీనికి సమాధానంగా

గవర్నరు జెనరలూ, గవర్నరులూ నిష్పాక్షికులు అనీ, వారు ఇతరుల ఆగ్రహానుగ్రహములకు లోనుగాకుండానే తమ అధికారాలను వినియోగిస్తారనీ విశ్వసించవచ్చుననీ చెప్పి పైచర్యను సమర్థించుకొన యత్నించారు. ఈవాదం ఏమాత్రమూ అంగీకారయోగ్యంగా లేదు నిజానికి న్యాయస్థానాధిపతులకంటె ప్రభుత్వ కార్యనిర్వాహక శాఖాధిపతులే ఈ పాక్షికభావాలకు ఎక్కువగా లోనయేవారు. అనుభవ పూర్వకములైన అనేక సాక్ష్యాధారాలు – కార్యనిర్వాహక శాఖాధిపతికి అలాంటి విషయాలతో సంబంధం ఉండటమూ అతడు జోక్యం కలిగించుకొనడమూ మంచిదికాదనీ, దీనివలన అతనికీ అతని మంత్రులకూ, శాసనసభలకూ మధ్య అనేక సంఘర్షణలు సంభవించడానికి అవకాశం కలుగుతుంది అనీ, కనీసం అల్ప సంఖ్యాక వర్గాలకూ వర్తకులకూ సంబంధించిన విషయాల వరకైనా రక్షణ కోర్టువారిద్వారా కలిగించడమే శ్రేయస్కరమనీ సూచిస్తున్నాయి. ఈపనిని కోర్టులకు అప్పగించడం ఇప్పుడు కాదంటే ఇంక కొన్నాళ్ళకైనా తప్పనిసరే అని వారు గ్రహించి ఉండవలసింది. భారతదేశము యొక్క రాజకీయాభ్యుదయానికి లక్ష్యం విడిపోవడానికికూడాహక్కుతో కూడిన అధినివేశ ప్రతిపత్తే అయితే, ఈ కార్యనిర్వాహక శాఖాధిపతులు కేవలం తమ మంత్రివర్గాల సలహాలను కార్యరూపంలోకి తెచ్చే రాజ్యాంగశాసనబద్ధ ప్రభుత్వాధిపతులు మాత్రమే అవుతారు. అలాంటి సమయంలో వారే ఈ హక్కులకు సంరక్షకులుగా ఉండటం అర్థంలేని పని.

ఈ సందర్భంలో ఈ వర్గాలవారి న్యాయసమ్మతమైన

హక్కులను సంరక్షించడంలో గవర్నరు జనరలూ, గవర్నర్లూ తమకు అవసరమని తోచిన ఏ శాసనాన్నైనా చేయడానికి గాని, ఏ ఆర్డినెన్సునైనా చేసి అమలుపరచడానికి గాని, ఎంత మొత్తమునైనా వెచ్చించడానికిగాని, మరి ఏ ఇతరపాలకచర్యలైనా పూనుకోవడానికిగాని, సంపూర్ణంగా స్వేచ్ఛకలిగి ఉన్నారనికూడా గమనించడం అవసరం హక్కులను అమలుపరిచే అధికారాన్ని న్యాయస్థానాలకు ఇస్తే అవే నిజమైన శాసన నిర్మాణసంస్థలుగా తయారు అవుతాయి. అనే విమర్శనను వెనకనే స్పృశించాం. 1935 ఇండియాచట్టంలో గవర్నరు జనరలూ గవర్నర్లూ ఈ వర్గాలయెడ తమ ప్రత్యేక బాధ్యతలను నిర్వర్తించడంలో వినియోగింపవలసిన శాసననిర్మాణ ఆర్థిక కార్యనిర్వహణ అధికారాలకు హద్దులనుకూడా నిర్ణయించలేదు.

మొత్తంమీద ఈ వివాద వలన తేలిన సారాంశం, 1935 ఇండియా చట్టంలో ప్రాథమిక స్వత్వాలజాబితా చేర్చబడక పోవడం. అక్కడికీ సర్ తేజ్ బహదూర్ సప్రూ వంటి అంతర్జాతీయన్యాయవేత్తలుకూడా సంయుక్తపార్లమెంటరీ కమిటీవారికి ఇలా నచ్చచెప్పాలని ప్రయత్నించేశారు.

"భారతదేశంయొక్క విలక్షణమైన పరిస్థితులలో ముఖ్యంగా అల్పసంఖ్యాకవర్గాలకూ, నిమ్నజాతులవారికీ రక్షణ కలిగించే ఉద్దేశంతో ప్రాథమిక స్వత్వాలనుగూర్చిన సనాతన బ్రిటిష్ న్యాయశాస్త్రదృక్పథానికిమాత్రమే ప్రాధాన్యమీయక ఆ హక్కులలో కొన్నింటికైనా ఈ చట్టంలో స్థానం కలిపించడం చాలా అవసరము"

ఈ చట్టంలో హక్కుల ప్రకటనతో కొంతైనా సంబం

థము కలిగిన నిబంధనలు రెండు మాత్రమే ఉన్నాయి. 298 వ నిబంధనలో ఇలా ఉంది:—

"చక్రవర్తియొక్క ఏ పౌరుడునూ తన మతము జన్మస్థానమూ, వంశమర్యాదా, వర్ణమూ – ఈ కారణము లన్నిటి మూలమునాగాని లేక ఏ ఒకదాని మూలమునగాని బ్రిటిషు ఇండియాలో ప్రభుత్వోద్యోగము చేయుటకూ ఆస్తులను సంపాదించుకొని అనుభవించుటకూ వివిధవృత్తులనూ వ్యాపారములనూ చేసుకొనుటకూ అనర్హుడుగా ఎంచబడడు."

ఈ నిబంధనయొక్క చివరిభాగంలో దీనివలన కలిగే ప్రయోజనాన్ని తగ్గించే మరొక షరతుకూడా ఉంది. 229 వ నిబంధనలో ఇలాఉంది :—

"బ్రిటిషు ఇండియాలో ఏవ్యక్తీ ఏదైనా శాసనముచేత అదొక శిక్షగా విధించబడినప్పుడు తప్ప మరి ఏవిధంగానూ ఆస్తిని అనుభవించు హక్కును కోల్పోడు."

మానవునియొక్కా, ముఖ్యంగా కర్షకుని యొక్కా, కార్మికునియొక్కా హక్కుల పత్రాన్ని ఈ చట్టంలో చేర్చడానికి బ్రిటీషు ప్రభుత్వాధికారులు నిరాకరించారంటే ఏమీ ఆశ్చర్యంలేదు. ప్రతి రాజ్యాంగశాసనమూ దాని నిర్మాణంలో పాల్గొన్న వర్గాలయొక్క హక్కులను సంరక్షించడాన్నే తన ప్రధానధర్మంగా ఎంచుకొంటుంది. వారు ముందు తమ హక్కులను చూచుకొన్న తరువాతనే తక్కినవిషయాలను గురించి ఆలోచిస్తారు. రాజ్యాంగశాసనాన్ని తయారు చేస్తూన్న ప్రధాన పక్షాలు ఏవో తెలిస్తే ఒ రాజ్యాంగశాసనం ఎలా ఉండబోతుందో ఎవరి హక్కులను అది సంరక్షిస్తుందో

అందుకొరకు ఎలాటి సాధనలను ఉపయోగిస్తారో సులభంగా చెప్పవచ్చు 1935 చట్టం ముఖ్యంగా బ్రిటిషు పార్లమెంటు యొక్క సృష్టి, మహమ్మదీయ అల్పసంఖ్యాకవర్గమూ, స్వదేశ సంస్థానాధిపతులూ కూడా కొంత జోక్యం కలిగించుకున్నారు. భారతదేశంలోని ప్రజాబాహుళ్యానికి గాని వారి పక్షాన మాటలాడగల ప్రముఖరాజకీయపక్షాలకుగాని చట్ట నిర్మాణంలో నిజమైన స్థానంలేదు. అందుచేతనే ప్రత్యేకంగా బ్రిటిషువారి దృష్ట్యా ముఖ్యములుగా కనిపించిన సూత్రాలూ కార్యక్రమాలూ మాత్రమే ఈ చట్టంలో చేర్చబడినాయి. దానిలో మానవునియొక్క, శ్రామికతంగతులయొక్క ప్రాథమికస్వత్వముల జాబితాకూడా చేర్చబడుతుందని ఆశించడం వల్ల ప్రయోజనంలేదు.

అయితే యెప్పటికైనా భారతదేశానికి నిజంగా ప్రజాస్వామిక రాజ్యాంగశాసనం తయారుచేయడమంటూ జరిగితే ఇటీవలి రాజ్యాంగశాసనాలన్నిటిలో లాగే దానిలోకూడా విధిగా ప్రాథమిక స్వత్వముల ప్రకటనను చేర్చితీరాలి. దేశంలోని అన్నిప్రముఖ పక్షాలవారూ సంస్థలవారూ—కాంగ్రెసూ, ముస్లింలీగూ, హిందూమహాసభా, ట్రేడుయూనియన్ కాంగ్రెసూ, కార్మికులూ, కర్షకులూ అందరూ దీనికి అనుకూలురుగానే ఉన్నారు. ఆ సందర్భంలో 1933 లో భారత జాతీయ కాంగ్రెసు వారు చేసిన తీర్మానంలో వారు నిర్వచించిన హక్కులతోకూడిన ఒక హక్కుల జాబితాను ఆధారంగా గ్రహించవచ్చును కాంగ్రెసువారు తయారుచేసిన జాబితా సంగ్రహంగానూ, ముఖ్యమైన అవసరమైన విషయాలన్నింటినీ కలిగినదిగాను ఉంది.

# అనుబంధము

## ప్రాథమిక స్వత్వములనుగూర్చిన కాంగ్రెసు తీర్మానము

కాంగ్రెసువారు భావించే స్వరాజ్యం ప్రజాసామాన్యానికి ఏవిధముగా ఉపయోగపడగలదో వారికి తేటతెల్లంగా తెలుపుడుచేయడం అవసర మని ఈ కాంగ్రెసువారు అభిప్రాయ పడుతున్నారు ప్రజాసామాన్యానికి జరుగుతూన్న అన్యాయాలను అరికట్టవలెనంటే, అన్నాతురులైన కోట్లకొలది ప్రజాసామాన్యముయొక్క ఆర్థికస్వాతంత్ర్యముకూడా రాజకీయస్వాతంత్ర్యంలో ఇమిడిఉండాలి అందువలన కాంగ్రెసువారు అంగీకరించబోయే ఏ రాజ్యాంగశాసనంలో నైనా ఈ క్రింది ప్రాథమికస్వత్వాలను విధిగా చేర్చాలి, లేక అలాచేర్చడానికి స్వరాజ్యప్రభుత్వానికి వీలుకలిపించాలి అని కాంగ్రెసు ప్రకటిస్తూంది

### ప్రాథమిక స్వత్వాలూ—విధులూ

1. (1) భారతదేశమందలి ప్రతిపౌరునకూ స్వేచ్ఛగా తన అభిప్రాయాలను ప్రకటించడానికీ, ఇతరులతో సంబంధబాంధవ్యాలు కలిగి ఉండడానికీ, న్యాయసూత్రాలకూ నైతికధర్మాలకూ విరుద్ధములు కాని ఆశయాలతో నిరాయుధులుగానూ, ప్రశాంతంగానూ సమావేశం కావడానికీ హక్కు ఉన్నది.

(2) ప్రతిపౌరుడూ ప్రజాశాంతిభద్రతలకు భంగకరము కాని విధాన ఆత్మస్వాతంత్ర్యమును అనుభవిస్తూ

స్వేచ్ఛగా తన మతాన్ని ప్రచారం చేసుకొనడానికీ, అనుష్ఠించుకొనడానికీ హక్కును కలిగి ఉన్నాడు.

(3) అల్పసంఖ్యాకులయొక్క, వివిధ భాషాప్రయుక్త మండలములయొక్క విజ్ఞానము, భాషా, లిపీ, రక్షింప బడతాయి.

(4) వర్ణ, కుల, మత, లింగ వివక్షతలు లేకుండా పౌరులందరు న్యాయశాస్త్రదృష్ట్యా సమానులుగా చూడబడతారు.

(5) ఏ పౌరుడూ, అతనియొక్క లేక ఆమెయొక్క వర్ణ కుల, మత, లింగములే కారణంగా ప్రభుత్వోద్యోగాలకూ, అధికార గౌరవపదవులకూ, వర్తక, వృత్తి వ్యాపారాలకూ అనర్హుడుగాగాని, అనర్హగాగాని, పరిగణింప బడరు.

(6) ప్రభుత్వమువారిచేగాని, స్థానికసంస్థలచేగాని నిర్వహింప బడుతూ ఉన్నటువంటివన్నీ లేక ప్రజలందరియొక్క ఉపయోగార్థం ప్రత్యేక వ్యక్తులచే ధర్మార్థముగా ఈయబడినటువంటివన్నీ బావులూ, చెరువులూ, రోడ్లూ, పాఠశాలలూ, ధర్మసత్రములూ— వీటి అన్నింటి విషయములోనూ పౌరులందరికీ సమానమైన హక్కులూ, విధులూ ఉంటాయి.

(7) ప్రతిపౌరుడూ, ఆ విషయికముగా చేయబడిన నిబంధనలనూ, నియమావళినీ అనుసరించి ఆయుధములను కలిగి ఉండానికీ, ధరించడానికీ హక్కును కలిగి ఉంటాడు.

(8) న్యాయశాస్త్రం విధిస్తేనే తప్ప ఏ వ్యక్తియొక్క స్వాతంత్ర్యము హరింపబడదు, అతని గృహముగాని, ఆస్తిగాని దురాక్రమింప బడటంగాని, అపహరింపబడటం గాని జరుగదు.

(9) అన్నిమతముల విషయంలోనూ ప్రభుత్వం తటస్థంగానే ఉంటుంది

(10) సార్వజనిక ప్రయోజన నియోజనాధికారము ఏర్పాటు చేయబడుతుంది

(11) ప్రభుత్వము ఉచిత నిర్బంధప్రాథమికవిద్యకు ఏర్పాటు చేస్తుంది.

(12) ప్రభుత్వము ఎవరికీ బిరుదులను ఇవ్వదు.

(13) మరణదండన ఉండదు.

(14) ప్రతిపౌరుడూ స్వేచ్ఛగా భారతదేశమంతటను సంచరించవచ్చును, దేశములో ఏభాగములోనైననూ స్థిరముగాగాని, కొంతకాలముగాని నివసింపవచ్చును. ఏ వృత్తినైనా వ్యాపారమునైనా సాగించుకొనవచ్చును; భారతదేశమందలి అన్ని భాగములలోనూ న్యాయ శాస్త్ర సంబంధమైన శిక్షనుగాని, రక్షనుగాని అందరితోనూ సమానమైన అర్హతను కలిగి ఉంటాడు.

## కార్మికులు

2. (అ) ఆర్థికజీవిత సంఘటనము న్యాయంగానూ, తృప్తికర

మైన జీవనపరిమాణమును కలిపించా లనే ఆదర్శం తోనూ ఏర్పాటు చేయబడుతుంది.

(ఆ) ప్రభుత్వము పారిశ్రామిక కార్మికులకు రక్షణలను ఏర్పాటుచేసి, ప్రత్యేక శాసనాలద్వారానూ, ఇతర విధములుగానూ వారికి యోగ్యమైన కూలి, పరిశ్రమలో ఆరోగ్యకరములైన ఏర్పాటు, పనిచేయవలసిన కాలము ఇన్నిగంటలు అనే నిర్ణయమూ, పనివారికీ, యజమానులకూ విభేదములు కలిగినప్పుడు సర్దుబాటు చేయడానికి తగిన సాధనోపాయాలూ, వార్ధక్యము వల్లనూ అనారోగ్యమువల్లనూ, నిరుద్యోగమువల్లనూ కలిగే ఆర్థికాపదలకు నివారకమైన రక్షణా ఏర్పాటు చేయబడతాయి.

3. వెట్టిచాకిరీపద్ధతినుండీ, అలాంటి ఇతర పద్ధతులనుండీ కార్మికులకు మోక్షము కలిగింపబడుతుంది.

4. స్త్రీ కూలీలకు రక్షణా, ముఖ్యంగా గర్భవతులై ఉన్నప్పుడు తగినంత కాలం సెలవు ఇప్పించడానికి ఏర్పాటు చేయబడుతుంది.

5. చదువుకొను ఈడుగల పిల్లలకు గనులలోనూ కర్మాగారాలలోనూ ప్రవేశం ఉండదు.

6. రైతులూ, కార్మికులూ సంఘాలుగా ఏర్పడి తమ సౌకర్యాలను రక్షించుకొను హక్కు కలిగిఉంటారు.

Printed at Rasatharangini Press, Bezwad[illegible] K. 7 A. 14-[illegible]46
for Q. H. No. M S. 405/D 1000 [illegible]